# శ్రీమన్నారాయణుడే పరతత్వము

రచయిత :

విద్యా విశారద

కీ॥ శే॥ కిళాంబి కృష్ణమాచార్యులు

చతుర్థ ముద్రణ : 1992

ప్రతులు : 500





వెల : రూ॥ **50/-**

ప్రాప్తిస్థానము :

శ్రీమతి కిళాంబి లలిత
బ్లాకు నెం. 15/II/335
పోర్టు క్వార్టర్సు, విశాఖపట్నం - 530 024.

ముద్రిణ :

ఎక్స్వేరియన్ ప్రింటింగ్ స్కూల్
43-11-24, సుబ్బలక్ష్మినగర్,
విశాఖపట్నం - 530 016. ఫోను . 47320

శ్రీః

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్

దేశికన్ తిరువడిగళే శరణమ్

# తనియన్గళ్

* * *

రామానుజ దయాపాత్రం జ్ఞానవైరాగ్య భూషణమ్ ।
శ్రీమద్వేంకటనాథార్యం వందే వేదాన్తదేశికమ్ ॥

కూరత్తాళ్వానరుళిచ్చెయ్దవై

లక్ష్మీనాథ సమారమ్భాం నాథయామున మధ్యమామ్ ।
అస్మదాచార్యపర్యన్తాం వన్దే గురుపరమ్పరామ్ ॥

యో నిత్యమచ్యుత పదామ్బుజయుగ్మరుక్మ
వ్యామోహతస్తదితరాణి తృణాయ మేనే ।
అస్మద్గురోర్భగవతోఽస్య దయైకసిన్ధోః
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే ॥

శ్రీ అళవన్దారరుళిచ్చెయ్దదు.

మాతా పితా యువతయస్తనయా విభూతిః సర్వం యదేవ నియమేన మదన్వయానామ్ । ఆద్యస్య నః కులపతేర్వకుళాభిరామం శ్రీమత్తదఙ్ఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా ॥

శ్రీపరాశరభట్టరరుళిచ్చెయ్దదు.

భూతం సరశ్చ మహదాహ్వయ భట్టనాథ శ్రీభక్తిసార కులశేఖర యోగివాహాన్ । భక్తాఙ్ఘ్రిరేణు పరకాల యతీన్ద్రమిశ్రాన్ శ్రీమత్పరాఙ్కుశమునిం ప్రణతోఽస్మి నిత్యమ్ ॥

శ్రీమతే రామానుజాయనమః శ్రీమద్వరవరమునయే నమః

శ్రీకాఞ్చీ జగదాచార్య, మహావిద్వాన్, ప్రతివాదిభయఙ్కరమ్

# శ్రీమదణ్ణఙ్గరాచార్యః

నిత్య శ్రీః

1) సీతారామాచార్య కృష్ణార్యవర్యౌ
వేదాంతార్థాన్ సమ్యగేవావగత్య ।
పూర్వాచార్యైర్దర్శితాయాం సరణ్యాం
తత్త్వార్థానాం శోధనంచక్రతుర్యత్ ॥

2) తచ్ఛ్రుత్వాఽహం భూరిముస్థానరత్నే -
ష్వానన్దం యం ప్రాపమాశ్చర్య పూర్ణమ్ ।
విద్వద్భ్యస్తః వేదయామి ప్రహృష్టః
సర్వేదృష్ట్వా ప్రాప్నువంతు ప్రహర్షమ్ ॥

3) శ్రీమల్లోకాచార్య వేదాంతసూర్యో
దివ్యగ్రంథేష్వర్థరత్నం వరిష్ఠమ్ ।
సంగృహ్యైతద్ గ్రన్థరత్నం న్యబంధీ -
త్యానందేన జ్ఞాపయా మ్యన్తరఙ్గమ్ ॥

4) తదిదం గ్రన్థరత్నం చేత్ గైర్వాణ్యా మవతారితమ్ ।
తర్హి సార్వత్రికా; ప్రాజ్ఞా పరమం హర్షమాప్నుయు ॥

This Book is Published in Memory of



Sreeman Kilambi Krishnamacharyulu,
M. A; M. Ed.

( 4-8-1926 — 15-10-1982 )

శ్రీమత్ దుందుభివత్సరే కన్యాంగతే భాద్రపదమాసే ।
ఉత్తరానక్షత్ర వేదాంతదేశికంపుత్రే శ్రీకృష్ణమార్యే పరమపదం పొందే ॥

*Published by :*

Wife : Smt. K. Lalitha Kumari

Sons : 1. K. R. BHASHYAM
Circle Inspector, CBCID, VZM, SKL Zones at VSP.

2. K. RAMANUJACHARYULU
Education Department

3. K. V. PRASAD
Sri Rasi Cements

4. K. T. SREENIVAS

## FATHER OF THE AUTHOR



Sreeman Kilambi Venkata Vedantacharyulu

1889 — 1963

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామి
వారి సత్సంగములో, ఉభయ వేదాంత ప్రవర్తకులైయున్న
శ్రీమాన్ న్యాయ వేదాంత విద్వాన్

## తెలికచర్ల కందాళ గోపాలాచార్యులవారి యొక్కయు, శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యుల వారి యొక్కయు

# అభిప్రాయము

శ్రీమదిత్యాది శ్రీమాన్ కృష్ణమాచార్యులవారు, శ్రీమాన్ సీతారామాచార్యులవారు చేసిన యీ ప్రయత్నము అత్యంత ప్రశంసనీయము. మన ఆధ్యాత్మవిద్యకు మూలమైన ఉపనిషత్తులలోని బ్రహ్మవిద్యలను సర్వులకు నందించుటకై సులభమైన శైలిలో తెలుగున ననువదించిరి. చాల ప్రశంసనీయమైన ఉద్యమమిది. ఉపనిషద్వాణి సులభము అగాధమును, సర్వమతములకు మూలము, విశ్వమున వేదాంత విచారమున కనాదిగా బీజావాపము చేసినదియును.

పరమాత్మోపాసనము అన్ని ప్రక్రియలలోచేసి, భగవానుడు జగత్కారణ భూతుడునగు శ్రీమన్నారాయణునితో సాయుజ్యము నొందుటే మానవ జీవిత పరమార్థమని, అట్టిచో నెరుంగవలసినవి తత్త్వహిత పురుషార్థములని, నిరూపించినవి ఉపనిషత్తులు.

చిదచిదీశ్వర తత్వములు మూడును తత్త్వములనియు, అందు ఈశ్వర తత్వము ప్రధానమనియు, చేతనా చేతనములు ఆ యీశ్వరునితో అపృథక్సిద్ధములై శరీరమువలె నుండుననియు, అట్టి విశిష్టమైన తత్త్వమే కారణము కార్యమునని తెలిపెడి ఉపనిషద్రహస్యము నెరింగించిన గ్రంథమిది. ఉపాసనకు భగవత్ప్రాప్తికిని సాధనము. ఇదియే జ్ఞానము. జ్ఞానము, ఉపాసనము వేరుకావు అని ఉపనిషత్సిద్ధాంతము. దాని నెరింగి ముముక్షువులు తరించుటకీ గ్రంథమెంతో సహాయపడును.

శ్రియఃపతియగు ఆ శ్రీమన్నారాయణుడు ఈ గ్రంథమును సకల ముముక్షు జనములకు ననుకూలముగా అలంబనమగునట్లు ప్రకటిత మొనర్చుగాక అని ఆశసించుచున్నాము.

# పరతత్వ నిరూపణం

## కళాప్రపూర్ణ డా॥ దాశరథి

(ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవి)

ఛాందోగ్యోపనిషత్తులో ఉద్దాలక అరుణికీ, అతని కుమారునికి మధ్య, ప్రశ్నోత్తర పూర్వకమయిన సంభాషణ – పరబ్రహ్మ స్వరూప నిరూపణానికి తోడ్పడినదని నేను భావిస్తున్నాను.

తన కుమారుడైన శ్వేతకేతువును తండ్రి అరుణి, న్యగ్రోధవృక్షఫలం తెమ్మంటాడు. తెచ్చిన పండును పగలగొట్టమంటాడు. కుమారుడు అలా చేస్తాడు.

"నీకేం కనపడ్డాయి?'' అని అడుగుతాడు తండ్రి.

''గింజలు" అంటాడు కుమారుడు.

ఒక గింజను పగలగొట్టమంటాడు తండ్రి. అందులో ఏముందని అడుగుతాడు. శూన్యమని చెప్తాడు కొడుకు.

"ఆ కనుపించని శూన్యంలో ఇంత పెద్ద న్యగ్రోధ వృక్షం ఉంది నాయనా!" అంటాడు తండ్రి.

అర్థంకాలేదంటూ, ఇంకా కొంత వివరించమని ప్రార్థిస్తాడు తండ్రిని శ్వేతకేతువు.

నీళ్ళలో ఉప్పువేయమంటాడు కొడుకుని తండ్రి. ఉదయం కొడుకుని పిలిచి నీళ్ళలో వేసిన ఉప్పుని తీసుకు రమ్మంటాడు. ఉప్పు కరిగి పోయింది కనుక తేలేనంటాడు కుమారుడు. తండ్రి ఆ నీళ్ళను రుచి చూడమని చెప్పగా, అలా నేచేసి ఉప్పగా ఉన్నాయని సమాధాన మిస్తాడు కుమారుడు.

"ఉప్పు కనిపిస్తున్నదా?'' ప్రశ్నిస్తాడు తండ్రి.

''లే'' దంటాడు కుమారుడు.

"ఉన్నది! లేనట్లు కనిపిస్తుంది కానీ ఉన్నది! మన శరీరంలో కూడా పరమాత్మ ఉన్నాడు కాని కనుపించడు.''

పరతత్వం మనలోనే ఉంది, దాన్ని పరిశోధించటానికి అనేకమార్గాలున్నాయి. ఉపనిషత్తులు ఆ మార్గాన్ని నిర్దేశిస్తున్నాయి. అగాధమయిన ఉపనిషత్ వాఙ్మయాన్ని మధించి సారం తీశారు ఈ ఆచార్యులు.

మహావిద్వాంసులైన కిళాంబి కృష్ణమాచార్యుల వారు విఖ్యాతులు. వీరు ముప్పది రెండు బ్రహ్మవిద్యలను గురించి సామాన్య పాఠకునికి అర్థమయ్యేట్లు వ్రాశారు.

నీటిలో కరిగిన ఉప్పువలె పరతత్వం సర్వత్రా కలదు. దాన్ని దర్శించగలశక్తి, సాధనవల్ల లభిస్తుంది. పరతత్వము నెరుగుటయే బ్రహ్మవిద్య.

ఒకచోటికి చేరుకొనుటకు వివిధ మార్గము లున్నట్లు పరతత్వమును తెలిసికొనుటకు భిన్న సాధనములున్నవి.

ఆ శ్రీమన్నారాయణుడొక్కడే పరతత్వము. ఈ అష్టాక్షరి అన్ని రహస్యాలను తనలో దాచుకున్నది.

"ఓం నమో నారాయణాయ"

ఆ నారాయణుడు కేంద్ర బిందువుగా యావద్విశ్వము వికసించును. అది సృష్టి. దానిని "మధ్యగామి" అనవలెను.

అఖండ బ్రహ్మాండము ఆ పరతత్వమున లీనమగును. దానిని ''మధ్యగామి'' అనవలెను.

ఔపనిషదములైన బ్రహ్మవిద్యలను వ్యాఖ్యానసహితముగా ఆంధ్రభాషలో చక్కగా రచించిన ఈ విద్వద్వర్యుని అభినందిస్తున్నాను.



ఎస్. వి. ఎస్. ఎ. కళాశాల సంస్కృతాధ్యాపకులు
రాష్ట్రపతి బహుమాన ప్రతిగ్రహీత శ్రీ ఉ॥ వే॥ శ్రీ అగు

## న. చ. రఘునాథాచార్యులవారి

# అభిప్రాయము

శ్రీమన్నారాయణుడే పరతత్త్వము అను సిద్ధాంతమును భగవద్రామానుజులు సకలోపనిషత్సమన్వయ పూర్వకముగా వేదార్థ సంగ్రహమును, శ్రీభాష్య - గీతాభాష్యముల యందును ప్రతిపాదించి యున్నారు. వారి యీ సిద్ధాంతమునకు మూల ప్రమాణములు తత్త్వద్రష్టలైన వ్యాసాది మహర్షులచే రచింపబడిన స్మృతీతిహాస పురాణాది ప్రబంధములైనట్లే, భగవత్కృపా సమాసాదిత దివ్యజ్ఞాన సంపన్నులైన ఆళ్వారాదులు ప్రసాదించిన దివ్యప్రబంధములు గూడనని పెద్దలు వక్కాణింతురు. మహర్షులు స్వయోగ మహిమాలబ్ధజ్ఞాన విశేషము చేత, బ్రహ్మతత్త్వ ప్రతిపాదక మంత్ర ద్రష్టలైనట్లే, ఆళ్వారులు గూడ భగవత్సాక్షాత్కారమునంది తదనుభవ జనితానంద పరీవాహ రూపముగ దివ్య ప్రబంధములను ప్రసాదించిన వారైనందున, ఈ ద్రావిడ దివ్యప్రబంధములకు గూడ సంస్కృత వేదసమాన ప్రామాణ్యము కలదని పూర్వాచార్యులవారి ఐక్య కంఠ నిర్ణయము.

సంస్కృత - ద్రవిడ భాషామయములగు ఉభయ వేదాంతముల యందును సమాన ప్రతిపత్తి గలిగిన భగవద్రామానుజులు ఉభయ ప్రమాణాను సారముగనే పరతత్త్వ నిర్ణయమును చేసిరను విషయము జగద్విదితము.

ఆళ్వారులందరిలోను ప్రధానముగ పరిగణింపబడు నమ్మాళ్వారులు శఠకోప మునీంద్రులు తమ తిరువాయ మొళి ప్రబంధమున దేవతాంతరములకన్న శ్రీమన్నారాయణునికి గల పరతత్త్వమును బహుముఖముల ప్రతిపాదించియున్నారు. మచ్చునకు వారి పాశురము నొక దానిని మన మిక్కడ చెప్పుకోవచ్చును.

పాశురము : "తీర్థనులగళంద, శేవడిమేల్,
వూందామం శేర్త్ అవైయే, శివన్ ముడి

మేల్ తాన్ కండ పార్తాన్ తెళిందొళింద,
పైందుళాయాన్, పెరుమై పేర్తుమొరువరాల్ పేశక్కిడందదే'

మహాభారతమునందలి ఈ క్రింది శ్లోకమున వివక్షితమైన కథ నాధారముగా గొనియే పై పాశుర మవతరించినది. ఆ శ్లోకమిది :

శ్లో॥ ''పార్థో విజేతా మధుసూదన స్య
పాదార విందార్పిత చిత్రపుష్పమ్ ।
దదర్శ గంగాధర మౌళి మధ్యే
బభూవ వీరః కృతనిశ్చ యార్థః"

తన కుమారుడైన అభిమన్యుని వధించిన జయద్రధుని జంపుటకై అర్జునుడు ప్రతిజ్ఞను చేసెను. కాని, అతడు పాశుపతాస్త్రముచేత గాని చావడు. అపుడు శివు నారాధించి పాశుపతమును సంపాదించుటకు అర్జునున కవకాశము చాలదు. రథసారధియైన శ్రీకృష్ణ పరమాత్మ తన శ్రీపాదములనే చూపి, వీనిని పుష్పాదులతో నర్చింపుమని ఆదేశించి అర్జునునకు పాశుపత మంత్రమును జ్ఞాపకము చేసెను. అట్లతడు జయద్రధుని వధించగలిగెను. అదేరోజు రాత్రి స్వప్నమున తాను శ్రీకృష్ణుని పాదములందుంచిన పుష్పములనే శివుని జటాజూటము నందున్నట్లు అర్జునుడు దర్శించి ఆశ్చర్య చకితుడై శ్రీకృష్ణుని పర తత్త్వమును దెలిసికొనగల్గెను. పై శ్లోకార్థమునే గ్రహించిన నమ్మాళ్వార్లున్నూ, ఈ ఘట్టముచే శ్రీమన్నారాయణ పరతత్త్వము నృష్టీక రించిరి.

ఇట్లనేక దివ్యసూక్తులచే ఆళ్వారులందరు స్థాపించిన పరతత్త్వ విశేషమునే రామానుజులును ప్రచార మొనర్చిరి. ఈ పరమార్థమును ఈ "శ్రీమన్నారాయణుడే పరతత్త్వము" గ్రంథమున తేటతెనుగులో ద్వాత్రింశత్ బ్రహ్మ విద్యలను ఇతర స్మృతీతిహాసాదులను ప్రమాణీ కరించుచు ఈ గ్రంథకర్త అగు - కృష్ణమాచార్యులు ఆంధ్రజాతి కంతకును శ్రీరామనుజ సిద్ధాంతమును అందించిన వారైరి. వీరి నిరూపణము లలిత హృద్యము ప్రామాణికమునై యున్నందులకు వీరిని హార్థికముగా అభినందించుచున్నాము.



# విషయ సూచిక

# శ్రీమన్నారాయణుడే పరతత్వము

శ్రీమజ్జగద్గురు శ్రీ రామానుజ సాంప్రదాయ యాచార్యులగు శ్రీ రాఘవాచార్య స్వామివారు, కల్యాణిపత్రికలోని "ఉపనిషదంక"కు మంగళా శాసనము చేయుచు, వ్రాసిన వ్యాసముయొక్క సారాంశము వినుడు !

అనంతము అపౌరుషేయమునకు వేదవాఙ్మయము యొక్క జ్ఞానకాండయే ఉపనిషత్సాహిత్యము. దీని యాధారముతో ఆధ్యాత్మ వాదులు :

"తత్కర్మ యన్నబంధాయ,
సా విద్యా యా విముక్తయే"

ఏది బంధనము గల్గింపదో అది కర్మ; ఏది బంధనము నుండి ముక్తిగల్గించునో అది విద్య అని చెప్పిరి. మహర్షులీ విద్యాప్రకాశము లోనే అనంతము సచ్చిదానందమునగు పరబ్రహ్మము యొక్క సాక్షాత్కారము బొందిరి; ఇతరులను బొందించిరి. ఈ విద్యనే బ్రహ్మవిద్య యని, పరవిద్య యనియు జెప్పిరి. బ్రహ్మమును బొందినవారికి, బ్రహ్మమునకును గల సంబంధమును గూడ స్పష్టపరచిరి. ప్రతిపాదన పద్ధతిలో విశేషముగా దెలియదగిన దానిని, పరంపర మొదలగు భేదములచే, స్వాభావికముగా నత డనేక రూపములు పొందియుండు విషయమును స్పష్టపరచిరి.

అవి వేర్వేరగు ఉపనిషత్తులలోను, ఒకే యుపనిషత్తులోని వివిధ భాగములలోను గ్రహింపబడి, సాధకులకు ప్రత్యక్ష మగుచున్నవి. అయినను, బ్రహ్మవిద్యయొక్క వివిధరూపముల లోపలనున్న స్వరూపగతైకత్వము మాత్రము లేచిపోలేదు. అంతేకాక, ఆ ఐక్యత సుస్థిరమై కూడ నున్నది.

దీని గొప్పతన మేమనగా, మీమాంసకులు ఈయన్ని బ్రహ్మ విద్యలలోని బ్రహ్మముయొక్క వివిధ రూపములను సమన్వయించు కొన్నారు. ఈ పద్ధతి నాశ్రయించి బ్రహ్మసూత్రకారుడు ప్రముఖ మైన బ్రహ్మవిద్యలను ముప్పదిరెండింటిని చర్చించినాడు. మరియు వాని సామరస్యమును గూడ వివేచించినాడు. ఆ చర్చయే బ్రహ్మ సూత్రముల రూపముగా నున్నది. బ్రహ్మసూత్రములను వేదాంత సూత్రములనియు, ఉత్తర మీమాంస యనియు నందురు.

సద్విద్య మున్నగు ముప్పది రెండు విద్యలను హృదయంగ మము చేసికొన్న మీదట, పరబ్రహ్మము యొక్క స్వరూప రూపగుణ విభవైశ్వర్యాదులకు సంబంధించిన సందేహము లన్నింటికిని, సమా ధానములు దొరకును. సగుణ-నిర్గుణములకు, భేద-అభేదములకు, ద్వైత-అద్వైతములకు నిత్యవిభూతి-లీలావిభూతులకు అన్యోన్యము గలుగు సమస్యలను జక్కగా బరిష్కరించుకొన వచ్చును. అయినను వేర్వేరు బ్రహ్మవిద్యలలో, పరబ్రహ్మముయొక్క వేర్వేరు నామ కరణములలోను బ్రహ్మవిద్యా మూలస్వరూపములలోను గూడ సందే హముల కవకాశము గలుగవచ్చును.

అందుకొరకే, శేషావతారులగు శ్రీ రామానుజులు బ్రహ్మ సూత్రములలోని "లింగభూయస్త్వాధికరణము" న, తైత్తిరీయోప నిషత్తు యొక్క నారాయణీయము నుల్లేఖించు సందర్భములో

"పరవిద్యాను, అక్షర శివ శంభు
పరబ్రహ్మ పరంజ్యోతి పరతత్త్వ
పరమాత్మాది నిర్దిష్టం, ఉపాస్యం,
వస్తు; ఇహ తై రేవ శబ్దైః అనూద్య,
తస్య నారాయణత్వం విధీయతే"

బ్రహ్మవిద్యలలో అక్షర-శివ-శంభు-పరబ్రహ్మ-పరంజ్యోతి- పరతత్త్వ-పరమాత్మ ఆదిశబ్దములు వచ్చియున్నవి. ఆ శబ్దములకే

నారాయణానువాకమందు, ఉపాస్యవస్తువగు పరతత్త్వమును నిర్దేశించుచు, అవన్నియు నారాయణునే తెల్పుచున్నవని నిర్ణయించినారు, మరియు

"అతో వాక్యార్థ జ్ఞానా దన్య దేవ
ధ్యానోపాసనాది శబ్దవాచ్యం జ్ఞానం
వేదాంత వాక్యై ర్విధిత్సితమ్"

బ్రహ్మవిద్యలవల్ల వచ్చెడి జ్ఞానమును వాక్యార్థజ్ఞానము వరకే పరిమితము చేయకుండ దానిని ధ్యానము - ఉపాసనము మొదలగు శబ్దముల చేత గూడ జెప్పదగినదని రామానుజులు నిర్ణయించినారు. ఈ విధమైన నిర్ణయమునకు గూడ 1) పాంచరాత్రాగమము, 2) భగవద్గీత 3) బోధాయన 4) టంక 5) ద్రావిడ ఆచార్యుల యొక్క పరంపరాబలమును ప్రాప్తించినది. పాంచరాత్రాగమము జ్ఞానకాండను ఆరాధ్యపరకముగా, మరి కర్మకాండను ఆరాధనా పరకముగాను దెల్పి, భగవ దారాధనములో సంపూర్ణముగా వేదవాఙ్మయమును వినియోగించెను.

అదే విధముగా గీతాచార్యుడును జ్ఞాన కర్మానుగ్రహీత భక్తి యోగము నుపదేశించి, జ్ఞానకాండను ఉపాసనా రూపముగా నిర్ణయించెను.

ఆ విషయములో బోధాయన ఋషి పరంపర కూడ, కర్మ మీమాంస-దైవమీమాంస-బ్రహ్మమీమాంసలను సమ్మేళన మొనర్చి, సర్వకర్మ సమారాధ్యుడు సర్వదేవాంతర్యామియునగు పరబ్రహ్మము యొక్క ఉపాసనయే పరమపురుషార్థ సాధనముగా నిర్ణయించి, బ్రహ్మ మీమాంస యొక్క ప్రాధాన్యమును స్థాపించినది.

ఈ విధముగా బ్రహ్మవిద్యలయొక్క మౌలికమైన ఉపాసనా స్వరూపము, సాధ్యభక్తియే యని తెలికొన్న మీదట, బ్రహ్మవిద్యల

మూలస్వరూపములం దంతర్భూతముగా నున్నది సిద్ధభక్తియే అను సందేశమును భగవద్రామానుజులు మనకిచ్చినారని తేటతెల్లమగును.

శరణ్యమైన పరతత్వముయొక్క మహాత్మ్యరూపముగా ప్రతి యొక బ్రహ్మవిద్యలోను ఈ సిద్ధభక్తియొక్క ఛాయ కనబడు చున్నను, ప్రత్యేకముగా న్యాసవిద్య తైత్తిరీయ - శ్వేతాశ్వతరో పనిషత్తుల రూపములో నుండి, ఆ సిద్ధ భక్తి స్వతంత్ర స్థానము కల్గి కూడ నున్నది.

ఇది 32 బ్రహ్మవిద్యలతో దులదూగుటయేకాక ఒక ప్రత్యేక వైలక్షిణ్యము గూడ కలిగియున్నది. ఆ వైలక్షిణ్యము న్యాసవిద్య యగుటె. పరమగుహ్యతమమైన యిది శరణాగతి మార్గము. దీని యందు పరమపురుషుని కృపాసహకారమువల్ల సాధకుడు కృతార్థుడు కృతకృత్యుడు నగుట కవకాశమున్నది. న్యాసవిద్యకాక మిగిలిన బ్రహ్మవిద్య లన్నియు బ్రహ్మమును బ్రాప్తింపజేయు లక్షణము మాత్రము కలవి. న్యాసవిద్య పరబ్రహ్మము యొక్క కటాక్షముచేత నాతనిని బొందు సౌకర్యముగూడ కల్గియున్నది. ఇది సాధనలోని యన్ని సంకటములను దొలగించి అకించనుడు అనన్య గతికుడునగు సాధకుని స్వయముగా పరబ్రహ్మమును జేర్చును.

# ఆచార్యులు - వారి శ్రీ సూక్తులు

"లక్ష్మీనాథ సమారంభాం
నాథ యామున మధ్యమాం
అస్మదాచార్య పర్యంతాం
వందే గురు పరంపరామ్"

శ్రీవైష్ణవ సంప్రదాయమును లక్ష్మీదేవి యేర్పాటు చేసినది. కావున శ్రీవైష్ణవ సంప్రదాయమును శ్రీ సంప్రదాయమనియు నం

దురు. ఈ సంప్రదాయమును నాథయామున రామానుజాళ్వార్లును గ్రంథముల ద్వారా స్పష్టపరచిరి. కావున ఈ ఆచార్యపరంపరకు నమస్కారముచేసి, వైష్ణవోత్తములు సత్కర్మానుష్ఠానము నారంభింతురు.

భాగవత దశమస్కంధములో శ్రీ కృష్ణునకు నీళాదేవియను భార్య కలదని యున్నది. వీరి నిరువురను ద్రావిడులు "కణ్ణన్ నప్పిన్న" యని యందురు. ఆళ్వార్లనగా విష్ణుభక్తి పరవశులని యర్థము. పన్నిద్దరాళ్వార్లు వ్రాసిన దివ్య ప్రబంధమునకు నాలాయిర మని పేరు.

నాలాయిర మనగా నాల్గువేల పాశురములున్న గ్రంథము.

నాథముని తిరునగరికి విచ్చేసి నమ్మాళ్వారును యోగము ద్వారా ప్రార్థింపగా, ఆయన కరుణాకటాక్షమున నాథముని ఈ పన్నిద్దరాళ్వార్ల ప్రబంధములను సంకలనము చేసి, "నాలాయిర దివ్య ప్రబంధ" మని పేరు పెట్టెను. ఆళ్వార్లందరకు శ్రీకృష్ణభక్తి విశేషముగా నున్నది.

"భూతం సరశ్చ మహదాహ్వయ భట్టనాథ
శ్రీభక్తిసార కులశేఖర యోగివాహాన్
భక్తాంఘ్రిరేణు పరకాల యతీంద్ర మిశ్రాన్
శ్రీమత్పరాంకుశ మునిం ప్రణతోస్మి నిత్యమ్".

## 1. పొయిగై యాళ్వారు :

(సరోజయోగి) ఈయన, ద్వాపరయుగమున, కాంచీపురములో శ్రవణా నక్షత్రమున, విష్ణుపాంచజన్యాంశమున, తామర పుష్పము నుండి జన్మించెను. జ్ఞాన-భక్తి వైరాగ్యములు గలవాడై ఆశ్రయించిన వారికి విష్ణుభక్తి నుపదేశించెను. ఈయన "ముదల్ తిరువందాది" అను గ్రంథమును రచించెను. ఇందు విష్ణుభక్తిని దెల్పుచు ముక్తపద గ్రస్తముగా నున్న 144 పాశురము లున్నవి. ఈయన శ్రీ సూక్తి : "విష్ణుమూర్తిని సహస్రనామాలతో అంజలించుచు, వందనము చేయు

భక్తు లెప్పుడును నరకమున బడరు. ఏ రకములైన యిబ్బందులను బొందరు. వారు భక్తిమార్గముననే తప్ప తదితర మార్గమునబో నిచ్ఛగింపరు". (ముదల్ తిరువందాది)

## 2. పూదత్తాళ్వారు :

(భూతయోగి) ఈయన, పొయిగై యాళ్వారు జన్మించిన మరునాడే ధనిష్టా నక్షత్రమున, సముద్రతీరమునగల తిరుక్కడల్మల్లై గ్రామములో, బందిగురువింద పూవు నుండి గదాంశమున జన్మించెను. పరభక్తి - పరజ్ఞాన - పరమ భక్తులు గలవాడై భగవదంతరంగ భక్తుడై, ఆశ్రితులకు విష్ణుభక్తినుపదేశించెను. ఈయన "ఇరండాం తిరువందాది" అను గ్రంథము రచించెను. ఇందు తాత్త్విక విషయములు అవతారముల గూర్చి శరణాగతిని గూర్చిన విషయములు తెలుపు 100 పాశురములు గలవు. ఈయన శ్రీసూక్తి : నారాయణుని గుణములను, లీలలను నుతించుట తపస్సుతో సమానము." (ఇరండాం తిరువందాది)

## 3. పేయాళ్వారు :

(మహాయోగి) ఈయన నందకాంశమున మైలాపురములో మాధవస్వామికోవెలలోని పుష్కరిణి ఎర్రకలువ పూవు నుండి యుద్భవించెను. ఈ పొయిగై-పూదత్త-పేయాళ్వార్లు ముగ్గురును యాదృచ్ఛికముగా తిరుక్కొవలూరులో గలిసికొనిరి. ఒక భక్తుని యింటియరుగుపై ఆ రాత్రి పండుకొనిరి. ఒకరి విషయము లొకరు చెప్పుకొనుచు గొంత సేపటికి ఇరుకైనది. కారణమేమాయని వారు దివ్యదృష్టితో జూచిరి. వారు శ్రీమన్నారాయణుడు సపరివారముగా నచటకు వచ్చియున్నట్లు కనిపెట్టిరి. ఆ భగవంతుని వారు మూడు వేదముల యర్థములును వచ్చునట్లు ముక్తపదగ్రస్తములుగా ద్రావిడపద్యములతో స్తుతించిరి. అవి యిప్పటికిని ప్రసిద్ధముగానే యున్నవి.

ఈ పేయాళ్వారు "మూనాృంతిరువందాది" అను గ్రంథము వ్రాసెను. ఇందు, తాత్త్వికమై ప్రకృతి సౌందర్యమును దెలుపుచున్న

100 అవతార విషయిక పాశురములు గలవు. ఈయన శ్రీసూక్తి : "విష్ణునామమునొకసారి స్మరించిన జాలును. విష్ణువాభక్తుని మనస్సులో నివసించును". (మూనాం తిరువందాది)

## 4. తిరుమడిశై ఆళ్వారు :

(భక్తిసారుడు) కాంచీపురమునకు తూర్పుగా భక్తిసారమను క్షేత్రమున్నది. భార్గవ మహర్షి యాగము చేసెను. అతని భార్య గర్భవతి యయ్యెను. కాని ఆమె మఖా నక్షత్రమున ఆకారములేని మాంసపు ముద్దను గనెను. వారు దానిని వెదురుపతుప్పలో బారవేసిరి. కొంతసేపటికి మావి జారిపోయి పిల్లవాడు ఏడువసాగెను. మేదరి వాడొకడాపిల్లవానిని గొనిపోయి, పెంచి పెద్దజేసెను. పిల్లవాడు భక్తిజ్ఞానములు గలవాడై తిరువల్లిక్కేణిలో యోగాభ్యాసము చేయుచుండెను. ఒకనాడతడొక బొంతను గట్టుకొనుచుండగా, శివుడు వచ్చి అతనికి "వరమిచ్చెద" నన్నాడు. అతడు "మోక్ష మీయగలవా?" యని శివు నడిగెను. శివుడు వేరొక వరము గోరుకొనుమనెను. ఆ యాళ్వారు "నా సూదివెంట దారము తప్పకుండ వచ్చినట్లు" వర మిమ్మని పరిహసించెను. శివుడు కోపముతో మూడవకన్ను దెరచెను. తిరుమడిశై యాళ్వారు తన పాదమునందలి కన్ను దెరచెను. ఇది శివుని కంటిమంటను మ్రింగివైచెను. శివుడతని మహత్తును దెలిసికొని భక్తిసారుడని యతనికి పేరు పెట్టెను.

ఒకనాడు శుక్తిహారుడను ఖేచరుడు వ్యాఘ్ర వాహనమెక్కి ఆకాశమునం దతనికి మీదుగా పోబోవుచుండెను. ఆ వాహన మాగి పోయినది. కారణ మేమాయని అతడు దిగివచ్చి భక్తిసారుని యోగ మహిమకు మెచ్చుకొని నీ బొంతను దీసివేసి నా దివ్యకవచమును ధరింపుమని, యొక దివ్యకవచ మతని కిచ్చెను. భక్తిసారుడు తన మహిమచే రత్నకవచమును నిర్మించి శుక్తిసారుని కిచ్చెను.

ఒకసారి పెరుంబులి యూరులో దిరుగుచుండగా నీయనను బ్రాహ్మణులు చూచి, మేదరివాడు వేదము వినరాదని చదివెడి వేదము నాపుచేసిరి. తరువాత వారు తరువాతి వేదవాక్యము జ్ఞాపకమునకు రాక, గొట్టుకొనుచుండిరి. భక్తిసారుడు తిరిగివచ్చి నల్లవడ్లగింజలను గోటితో వొలిచి వారికి జూపించెను. అప్పుడు వారికి

"నైర్‌ృతం చరుం పరివృత్త్యగ్నే హే
(తర్వాత) కృష్ణానాం వ్రీహీనాం
నఖ నిర్భిన్నమ్"

అను వాక్యము స్మృతికి వచ్చెను.

భక్తిసారుడా యూరి దేవాలయమునకు ప్రదక్షిణము చేయు చుండునప్పుడల్లా, లోనున్న యర్చా విగ్రహము అతడు తిరుగుచున్న వైపుగానే మళ్లుచుండెడిదట. ఇట్టి మహిమలెన్నో అతని చరిత్రలో గలవు. ఇతడు చక్రాంశమున జన్మించి రెండువేల యైదువందల సంవత్సరములు జీవించెను. ఉపనిషదర్థము దెలుపు తొంబదియారు పాశురముల "నాన్ ముగన్ తిరువందాది" ప్రబంధమును వ్రాసెను. ఇందు విష్ణుమూర్తి ధర్మములు, భగవ ద్విగ్రహమును గలవు. ఈయన శ్రీసూక్తి : "ఓ కేశవా! నీవు ప్రేమస్వరూపుడవుగా అమృతస్వరూపు డవుగా నా సర్వస్వముగా గూడ నాకు గనబడుచున్నావు. నేను నీ యాజ్ఞను శిరసావహింప సిద్ధముగా నున్నాను. నీవు నన్ను స్వీక రింపుము! సర్వదా నీవే నాకు దిక్కు. నీవుతప్ప నాకేదిక్కును లేదని తెలిసికొనుచున్నాను." (నాన్ముగన్ తిరువందాది)

## 5. పెరియాళ్వారు :

(విష్ణుచిత్తుడు) ఈయన పాండ్యదేశ వైష్ణవుడు. కలియుగాదిని జన్మించెను. శ్రీవిల్లిపుత్తూరులోని వటపత్రశాయి ఆలయములో మాలా కైంకర్యము చేయు భక్తుడు. ఆ భగవంతు డనుగ్రహించి ఆయనకు



శ్రీమద్భగవద్రామానుజులు

శ్లో॥ కాషాయశోభి కమనీయ శిఖానివేశం,
దండత్రయోజ్జ్వల కరం విమలోపవీతం
ఉద్య ద్దినేశనిభ ముల్లస దూర్ధ్వపుండ్రం,
రూపం త వాస్తు యతిరాజ! దృశో ర్మ మాగ్రే॥



గోదాదేవి

శ్లో॥ నీళా తుంగస్తనగిరి తటీసుప్త ముద్బోధ్య కృష్ణం
పారార్థ్యం స్వం శ్రుతిశత శిర స్సిద్ధ మధ్యాపయంతీ
స్వోచ్ఛిష్టాయాం స్రజి నిగళితం యా బలాత్కృత్యభుంక్తే
గోదా తస్యై నమ ఇదమిదం భూయ ఏవాస్తుభూయః ॥

"యుక్తులతో పరతత్వమును నిర్ణయించిన వారికి పాండ్యరాజు బంగారు నాణెముల సంచి నిత్తునని యా సంచిని సభాభవన స్తంభమునకు గట్టి యుంచినాడు. నీవుపోయి శ్రీమన్నారాయణుడే పరతత్వమని నిర్ణయించి యా బహుమానమును పొందుము. నేను నీ నాల్కపై నుండి జయింపజేతు" నని చెప్పినాడు.

అట్లే విష్ణుచిత్తుడు వెళ్ళి విష్ణువే పరతత్వమని నిర్ణయింపగా స్తంభమునుండి నాణెముల సంచి యూడిపడెను. దాని నాయన బహుమానంగా నొందెను. ఈ పెరియాళ్వారు గరుడాంశమున జన్మించెను.

ఈయన రెండు గ్రంథములు రచించెను. 1. "తిరుప్పల్లాండు"లో 12 పాశురములు గలవు. ఇందు గరుడధ్వజుని మంగళాశాసనం గావించిన మధుర గీతములు గలవు. 2. "పెరుయాళ్వారు తిరుమొళి" గ్రంథంలో 461 పాశుర పాశురములు గలవు. ఇందు బాలకృష్ణ లీల లభివర్ణితములు.

## 6. గోదాదేవి :

శ్లో॥ కర్కటే పూర్వ ఫల్గుణ్యాం
తులసీ కాననోద్భవాం ।
పాండ్యే విశ్వంభరాం గోదాం
వందే శ్రీ రంగనాయకీం ॥

ఒకసారి యా పెరియాళ్వారు తులసి వనమును త్రవ్వుచుండగా నొక పసిబాలదొరికినది. సంతానము లేనిఆ యాళ్వారు పేదకు పెన్నిధి దొరికినట్లు దొరికిన యా బాలికను, మహానందంతో గొనిపోయి తన భార్యకిచ్చెను. వారా బాలికకు గోదాదేవియని పేరుపెట్టి, అల్లారు ముద్దుగా బెంచుకొనుచుండిరి. గోదా ఐశ్వర్యమిచ్చునది. అనగా లక్ష్మి యని యర్థము. ఆమె లక్ష్మీదేవ్యంశమున జన్మించినదే. ఆమె క్రమ

ముగా బెరిగి పెద్దదైనది. ఒకనాడు పెరియాళ్వారు మామూలు ప్రకారం, వటపత్రశాయి పెరుమాళ్ళకని, పుష్పమాలిక నందముగా గట్టి, బుట్టలో బెట్టుకొనెను.

గోదాదేవి శ్రీకృష్ణుని వివాహ మాడుదునని పట్టుబట్టియున్నది. కావున తండ్రి కట్టియుంచిన పూలమాలను ధరించుకొని, "తాను పెరుమాళ్ళకు భోగ్యంగా నుందునా యుండనా" యని దీర్ఘికలోని నీళ్ళలో జూచుకొని మురిసిపోయినది. వెంటనే మాల నెప్పటియట్లు బుట్టలో బెట్టినది. ఇట్లు కొన్ని రోజులు గడచినవి.

ఒకసారి పెరియాళ్వారది గమనించి, ఆవేళ వొట్టిచేతుల తోడనే పెరుమాళ్ళ సన్నిధికిపోయి, తాగట్టిన మాల యపవిత్రమైనదని విన్నవించుకొనెను. పెరుమాళ్ళు ఆ యాండాళ్ళు ధరించిన మాలికయే తన కత్యంతము ప్రేమపాత్రమని చెప్పగా, నట్లే ఆళ్వారా మాలికను ఆయనకు సమర్పించెను.

వటపత్రసాయి యాజ్ఞచే శ్రీరంగమున వేంచేసియున్న శ్రీరంగనాయకుల కాండాళ్ళనిచ్చి, వివాహము గావించెను. అట్లామె రంగనాథుని దేవేరి యైపోయినది.

ఆమె పెరుమాళ్ళనే పెండ్లి చేసికొందునని పట్టుబట్టిన సందర్భములో బట్టిన ధనుర్మాస వ్రత విశేషములను, 'తిరుప్పావై'వను పేరుతో ముప్పది పాశురములను రచించెను. అవి వైష్ణవోత్తముల కత్యంత ప్రీతి పాత్రములు. నాలాయిర ప్రబంధంలో మొదటి భాగమందీ తిరుప్పావై చేర్చబడినది. ఆ పాశురములకు తాత్పర్యము తెలుగులో ఈ క్రింది విధముగా నుండును.

**తిరుప్పావై :**

1. ఆభరణములు ధరించిన గోకుల బాలికలారా! చంద్రునితో గళకళలాడు మంచి మార్గశిర మాసముగదా యిది, వ్రత స్నాన

మాచరింప రాదలచిన వారందరు రండి! వీరుడగు నందునిచే బాలింప బడువాడు, యశోద ముద్దులపట్టి, నీలమేఘ శ్యాముడు, ఎఱ్ఱని కను దమ్ములు సూర్యచంద్రులవంటి శ్రీముఖము గలవాడునగు నారాయ ణుడే మన కోరిన కోర్కెలు దీర్చువాడు. లోకులు కొనియాడునట్లు మనము వ్రత నిష్ఠలో మునిగియుందము రండి! ఇదేకదా మన వ్రతము.

2. భూమియందు హాయిగా మనదలచిన అమ్మలారా! మనమీ వ్రతమందు బాటింపవలసిన నిబంధనలను వినుడు! పాలసముద్రంలో నాదిశేషునిపై బవళించిన పరమాత్ముని శ్రీపాదములను గుర్తించుచు, వేకువనే స్నానమాడి, పూలను కాటుకను ధరింపక, నేతిని పాలను వర్జించి, చెడుపనులు చేయక, యథాశక్తిగా యోగ్యులకు దానధర్మ ములు చేయుచు, యాచకులకు బిచ్చములు పెట్టుచు, బ్రతుకు విధ మును దలచుకొని యానందింపవలెను. ఇదేకదా మన వ్రతము.

3. వామనావతారమున లోకములను పాదములతో గొలిచిన పురుషోత్తముని దివ్యనామ సంకీర్తనము జేయుచు, ఈ వ్రతం పేరుతో మనము స్నాన మాచరించినచో, దేశమం దంతటను నెలకు మూడు వానలు కురిసి, భూమి పైరుపచ్చలతో గళకళ లాడును. జలసమృద్ధ మగుచోట్ల చేపలు చక్కగా బారలాడుచుండును. పూసిన కలువలలోని మధువాని మత్తిల్లి, తుమ్మెదలు నిద్రించును. పశువులు పొదుగులు పట్టుకొనుటయే తడవుగా, కుండల కొలది పాలిచ్చును. ఇట్లు భూమి పాడిపంటలతో దులదూగును. కరవుకాటకములురావు. ఇదేకదా మన వ్రతము.

4. ఓ మేఘాధిపతీ! నీ శక్తిని దాచుకోబోకుము. నీవు సముద్ర జలము ద్రాగి, సర్వేశ్వరుడగు శ్యామసుందరునివలె నల్లనై, ఆకాశ మెక్కి, బలసౌందర్యములున్న భుజములుగల పద్మనాభుని కుడిచేతి చక్రమువలె మెరయుచు, నతని యెడమచేతి శంఖమువలె నురుముచు,

అతని ధనుస్సునుండి రావణ వధకాలమున వెలువడిన బాణవర్షము వలె లోకసుభిక్షమునకై జలముల నర్పింపుము. అందు మేమును మార్గళి వ్రతస్నాన మాచరించి సంతోషింతుము. ఇదేకదా మన వ్రతము!

5. అచ్చెరువుగొల్పు గుణములు గలవాడు, ఉత్తర మధురాధిపతి, మంచిపేరుగల యమునానదీ తీరమున విహరించువాడు వ్రజకులమునకు మాణిక్యదీపం వంటివాడు. మాతృగర్భమును ధన్యంచేసినవాడునగు శ్రీ కృష్ణుని మనము పవిత్రులమై మంచిపూలబూజించి, నమస్కరించి, మధురకంఠంతో గానంచేసి, మనస్సున ధ్యానించినచో, పూర్వ పాపములు, రాబోవు పాపములు నిప్పులోబడ్డ దూది పింజలవలె నశించును. కావున సర్వేశ్వరుని తిరునామ సంకీర్తనం జేయుడు! ఇదే కదా మన వ్రతము!

6. పక్షులు కూయుచు నెగిరిపోవుచున్నవి. గరుడ ధ్వజుడగు సర్వేశ్వరుని యాలయమున శంఖధ్వని వినబడుట లేదా? అమ్మాయిూ లేచిరావమ్మా, పూతనాస్తన విషము గ్రోలినవాడు, వంచకుడగు శకటాసురుని కీళ్ళు విరుగదన్నినవాడు, క్షీరసముద్రమున శేషపర్యంకమున యోగనిద్రా ముద్రితుడైనవాడు, సర్వకారణుడునగు సర్వేశ్వరుని మననము చేయుచు, మునులు యోగులును లేచి హరి హరియని చేయు భగవన్నామము మన మనస్సుల జల్లబరచుచున్నది. ఇదేకదా మన వ్రతము.

7. ఓ పిచ్చిదానా! భరద్వాజ పక్షులు కలిసి కూయుచున్నవి. వినబడుట లేదే! కాసులపేర్లు మంగళసూత్రములు గలగల మనకుండ బట్టుకొనుచు, బరిమళించు తలవెంట్రుకలుగల గోపికలు, కవ్వపు ధ్వనితో బెరుగు జిలుకు చప్పుళ్ళు వినబడుట లేదా యేమే. ఓ నాయకురాలా! అవతార స్వరూపుడు కేశినిషూదనుడునగు శ్రీ కృష్ణుని మేము గానము చేయుచుండగా వినుచుగూడ నీవింక నిద్రించుచున్నావా!

ఓ తేజోవంతురాలా! ఇకనైన తలుపు తెరువుము! ఇదేకదా మన వ్రతము.

8. తూర్పు తెల్లవారినది పశువులు మేతమేయ బోవుచున్నవి. పోవు బాలికలనందర నాపి నిన్ను బిలువవచ్చితిమి. లేలెమ్ము. ఆసక్తి గల యువతివిగదా, వాద్యములతో శ్రీ కృష్ణుని గానము చేయుచు బోదము. అశ్వాసుర-చాణూరముష్టికాసురుల సంహారించిన దేవదేవుని డగ్గరి సేవింతము. అతడు మన యుద్యమము చూచి కటాక్షించును. ఇదేకదా మన వ్రతము.

9. మంచి మాణిక్యాల మేడలో నలుగడల దీపములు వెల్గు చుండగా, ధూపములు పరిమళించు చుండగా, పట్టుపాన్పున కనులు మూసుకొన్న మరదలా! తలుపు గడియ తీయుము. అత్తగారూ! ఆమెను లేపరు? మీ యమ్మాయి మూగదా, చెవిటిదా? అలసిపోయి యున్నదా, కాపలా కాయుచున్నదా? మొద్దునిద్ర పోవుచున్నదా? ఆశ్చర్యము గొల్పు కల్యాణ గుణములుగలవాడా! మాధవా! వైకుంఠా! యని భగవద్గుణగానము చేయుచు వచ్చినాము, లేపి మా గోష్ఠిలోనికి బంపుడు! ఇదేకదా మన వ్రతము.

10. ఓ యమ్మా! చక్కగానోచి సుఖపడదలచితివే! పిలుచు చున్నను తలుపు తెరువవు! తెరువనిదానవు పలుకనైన పలుకవు. తుల సిని కిరీటమున ధరించిన నారాయణుడవు మనము పొగడగా (పాద్య విశేషముల) పురుషార్థముల నిచ్చును. ఈ పుణ్యమూర్తిచే రామావ తారమున మరణించు కుంభకర్ణుడు నీకి నిద్రనిచ్చి పోయినాడో! యేమో! ఇంత నిద్రయా! తెలివితెచ్చుకొని లెమ్ము! ఇదేకదా మన వ్రతము.

11. పసుల పాలు పిదుకుచు, వానికి శత్రుబాధ లేకుండ జూచు కొనుచు, గడుసుతన మెరుగని గోపాలుర హేమలతా! వనమయూరీ! ఫణిఫణ నితంబబింబా! లేచిరమ్ము! దగ్గరి వాండ్రము స్నేహితురాం

ద్రడము నిన్ను బిలువ వచ్చితిమి. నీ వాకిట నిలుచున్నాము, మేఘ శ్యాముడగు సర్వేశ్వరుని గుణగానము చేయుచున్నాము. నీవు కదలవు మెదలవు ఉలుకవు పలుకవు, ఓ భాగ్యవంతురాలా! మన లక్ష్యమేమిటి? ఇట్లు పరుండుటలో నీ యుద్దేశ్యమేమి? ఇదేకదా మనవ్రతము.

12. దూడలపై ప్రేమచే బాలుస్రవించు పశువులు గల సంపన్న గృహస్థుని చెల్లెలా! మంచు కురియుచున్నను నీ వాకిలిచూర్లు పట్టు కొని లంకేశ్వరుడగు రావణుడు జంపినవాడు, మనస్సునకు భోగ్య మైనవాడునగు రాముని భజన చేయుచు, వచ్చినను నీవు తెరువవు! ఇకనైన లే. ఇదేమి నిద్ర తల్లీ! యిరుగు పొరుగు వారుగూడ మన విషయము వినుచున్నారు. ఇదేకదా మన వ్రతము.

13. బకాసురుని నోరు చీల్చినవాడు, దుష్టరావణు గిల్లివేసిన వాడునగు భగవంతుని గీర్తించుచు బోయి, పిల్లలందరు నోము నోచు కొన్న చోటుకు చేరుకున్నారు. వేగుచుక్క పొడిచినది. గురుడస్తమించి నాడు. పక్షులు మేతకై కూయుచు బోయినవి. పద్మమున తుమ్మెదలు వాలినట్లు అందమైన కనులుగలదానా! చిన్నదానా! ఈ వ్రతదినము లలో కృష్ణుని గుణాను సంధానము నీవొక్కదానివే రహస్యముగా జేయుచున్నావా! మాతోగలసి విరహతాప మడగునట్లు స్నానమాడ రాక, యింకను పాన్పున బవళించినావా! మా గోష్ఠిలోనికి రమ్ము! ఇదేకదా మన వ్రతము.

14. మీ పెరటి దిగుడుబావిలోని యెర్రకలువలు వికసించినవి. నల్లకలువలు ముకిళించినవి. కాషాయ వస్త్రములుగట్టి తెల్లని పలువరు సలుగల యర్చకులు, తమ దేవాలయములకు బోయి, కుంచకోలలతో తలుపులు తెరచి, యారాధింపబోవుచున్నారు. మమ్మే మేల్కొలుపు దునని మాటయిచ్చినావు. సిగ్గుగులేదా? మధుర భాషిణీ! శంఖు చక్రములు హస్తములందు ధరించిన యా పద్మాక్షుని బాడుటకై లేచి రమ్ము. ఇదే కదా మన వ్రతము.

15. శుకవాణీ! ఇదేమమ్మా! ఇంకను నిద్రించుచున్నావా!".

"అబ్బా! గొల్లుమని కేకలు వేయకండమ్మా పూర్ణులారా! ఇదిగో వచ్చుచున్నాను."

"శక్తిమంతమైన నీ నోటి దురుసుతనమును, మే మిదివరకే యెరుగుదుము."

"శక్తిమంతురాండ్రు మీరే. నేనే అయితే అట్లే కానిండు."

"నీవు త్వరగా లేచిరా, నీ యుద్దేశ్య మేమిటి?"

"అందరూ వచ్చినారా."

"వచ్చినారు. ఇంక నీవు వచ్చి లెక్కపెట్టుకొమ్ము. కువల గజమును జంపినవాడు, శత్రువుల శత్రుత్వమును బోగొట్టు శక్తి మంతుడు, కల్యాణగుణ పూర్ణుడునగు శ్రీ కృష్ణుని గీర్తింప రారమ్మ! ఇదేకదా మన వ్రతము.

16. మా నాయకుడైన నందగోపుని ప్రాసాదమును గాపాడు వాడా ధ్వజ_మకర తోరణాంగణ ద్వారపాలకా! మాణిక్యాల గడి యను తీయుము. కల్యాణగుణుడు, మాణిక్య వర్ణుడునగు శ్రీకృష్ణుడు మా నోమున కుపకరణములగు (వాద్య విశేషముల) పురుషార్థముల నిత్తునని, నిన్ననే వాగ్దానము చేసెను. ఆయనకు మేల్కొల్పులు పాడు టకై వచ్చితిమి. నీవు మొదటనే మమ్ము మాటలతో నడ్డగింపకుము. తలుపులు తెరువమని కోరుచున్నాము.

17. వస్త్రముల నన్నపానీయముల నిచ్చువాడవు, మా స్వామి వియునగు నందనందనా! మేలుకొమ్ము. స్త్రీలందరిలోకి చిగురువంటి దానా! గోప కులమునకు దీపము వంటిదానా! మా స్వామిని నగు యశోదాదేవి! మేలుకొనుము! లోకముల గొలిచిన వామనా! నిత్య సూరులకు ప్రభువైన శ్రీ కృష్ణా! నిద్రింపక లేచిరావయ్యా! బంగారు

కడియాల పాదములుగల భాగ్యవంతుడవగు బలరామా! నీవు, నీ తమ్ముడును నిద్ర చాలించి లేచిరండి. ఇదేకదా మన వ్రతము.

18. మదపుటేనుగు వంటి బలముగల నందునియొక్క కోడలా! ఓ నప్పిన ఫిరాట్టీ! పరిమళించు ముంగురులు గలదానా! తలుపు గడియ తీయుము! కోళ్లుకూయుచున్నవి. బండి గురివెంద పందిరి మీద కోకిలలు కూయుచున్నవి. బంతులవంటి వ్రేళ్ళు గలదానా! నీ నాయకుడగు శ్రీ కృష్ణునిపై మేము తిరునామములు పాడుచుండగా, ఎర్ర తామర వంటి చేతులతో అందమగు గాజులు చప్పుడగుచుండ, సంతసమున వచ్చి తలుపు తీయుము! ఇదేకదా మన వ్రతము.

19. గుత్తులవలె దీపములు వెలుగుచుండగా, దంతపు కోళ్ళ మంచము మీద మెత్తనై యందగించు పాన్పున, పూలముంగురులు గలిగియున్న నప్పిన్న ఫిరాట్టియొక్క స్తనములను రొమ్మున హత్తుకొని, పవళించిన కృష్ణా! మాట్లాడుము. విశాలమగు కాటుక కనులదానా! నీవు నీ మనోహరుని ఎంతసేపటికిని నిద్రలేవ నొప్పుకొనకున్నావు. ఇంత కృష్ణ విరహము సహింపకపోవుట, నీ స్వరూప స్వభావములకు తగదమ్మా! ఇదేకదా మన వ్రతము.

20. ముప్పది మూడుకోట్ల దేవతల భయము దీర్పగల బలవంతుడా! లెమ్ము. ఋజువర్తనగల స్వామీ! శక్తిమంతుడా! శత్రు భయకరుడా! నిర్మలుడా! మేలుకొమ్ము. బరిణవంటి వైరముడి, ఎర్రని పెదవి, సన్నని నడుముగల నప్పిన్నా! పూర్ణులారా! లక్ష్మీ స్వరూపురాలా! నిదురలెమ్ము. మా వ్రత స్నానాంగములై వింజామరము అద్దమునిచ్చి నీ పతియగు శ్రీ కృష్ణుని మమ్ము నిపుడే జలక మాడింపుము! ఇదేకదా మన వ్రతము.

21. కడవల కొలది పాలిచ్చు పశుసంపదగల నందకుమారా! మేలుకొనుము! ఓ భక్త రక్షకా! ప్రకటముగా నవతరించిన తేజశ్శాలీ

నిదుర లేచిరమ్ము. నీ శత్రువులు దుర్మతులై నీ వాకిట గతిలేక నిన్నాశ్రయింప బడినట్లు, మే మహంకార మమకారముల బోగొట్టు కొని, అనన్యగతికులమై నీకు మంగళా శాసనము చేయుచున్నాము. నీ కల్యాణ గుణగానము చేయుచు, వచ్చియున్నాము. ఇదేకదా మన వ్రతము!

22. రాజులు అభిమానపడక నీ సింహాసనము క్రింద గుంపులుగా బడియుండునట్లు మేమును వచ్చి చేరితిమి. గజ్జెల నోళ్ళవలె కొద్దిగా విచ్చిన, తామరలవంటి నీ సుందర మందకటాక్షమును, కొద్దిగా మాపై బ్రసరింపజేయుము. ఉదయించిన సూర్యచంద్రులవలె నున్న నీ నేత్రద్వయముతో మమ్ము జూడుము! మా పాపములు నశించును. ఇదేకదా మన వ్రతము.

23. అవిసెపూవు వంటి దేహకాంతిగల కృష్ణా! పర్వత గుహ నుండి నిద్రించి లేచి, కేసరములు నిక్కరపొడువ మేను విదళించి, మూలిగి సాగి శౌర్యముతో గర్జించుచు, బయటికివచ్చు సింహమువలె, నీ మందిరము నుండి సభా భవనమునకు వచ్చి, విజయ సింహాసన మున నాసీనుడవై, మేము వచ్చిన కార్యమును విచారించి, దయ జూడుము! ఇదే కదా మనవ్రతము!

24. వామనావతారమున లోకముల గొలిచిన నీ పాదములకు మంగళా శాసనము. రామావతారమున లంకకుబోయి లంకేశ్వరుని నశింపజేసిన నీ బలమునకు మంగళా శాసనము. శకటాసురుని దన్నిన నీ కీర్తికి మంగళాశాసనము. వత్సాసురుని గోజిబిళ్ళను వలె చిమ్మిన కృష్ణా! నీ పాదములకు మంగళాశాసనము. గోవర్ధనమును గొడుగుగా నెత్తిన గోపాలా! నీ కళ్యాణ గుణములకు మంగళాశాసనము. పరుల పగను బోగొట్టు నీ చేతిబల్లెమునకు మంగళాశాసనము. ఇట్టి నీ వీర

చరిత్రమును నుతించి నీవల్ల పురుషార్థములను బొందుటకై యిపుడు మేము వచ్చితిమి. కరుణింపుము. ఇదేకదా మన వ్రతము.

25. దేవకికి బుట్టిన రాత్రియందే, యశోదకును గుమాండవై నీవు చాటుగ బెరుగుచుండగా, నిది విని సహింపని కంసుని, మట్టుపెట్టిన కృష్ణా! ఆశ్రితవత్సలా నిన్ను యాచింప వచ్చితిమి. వాద్యవిశేషముల నిచ్చినచో లక్ష్మీదేవి యాసించు సంపదను వీరత్వమును మేము కీర్తించి, దుఃఖముల బోగొట్టుకొని, యానందం పొందెదము. ఇదేకదా మన వ్రతము.

26. ఆశ్రిత వత్సలా! మాణిక్యవర్ణుడా! పూర్వు లనుష్టించినవి, మేము కోరుచున్నవియునగు మార్గళిస్నాన వ్రతాంగములను, మా కొసగుము. పాలవలె తెల్లనై బాగుగా ధ్వనించు నీ పాంచజన్యము వంటి శంఖములను, మంచిగా మ్రోగు పెద్దపెద్ద తప్పెటలను, తిరు నామ సంకీర్తనము చేయువారిని, మంగళ దీపములను, ధ్వజములను, చాందినిని, మా కొసగుము, ఇదేకదా మన వ్రతము.

27. ఆశ్రయింపక ద్వేషించువారిని జయించు సద్గుణములు గల గోవిందా! నిన్ను కీర్తించి, వాద్యవిశేషాది పురుషార్థముల బొందుదుము. మేము పొందు సన్మార్గమునకు, లోకులు పొగడునట్లు చక్కగా కంకణములు, భుజకీర్తులు, కర్ణాభరణములు, కర్ణ పుష్పములు, పాదాభరణములు మున్నగు నాభరణములను మేమలంకరించు కొందుము. విలువగల వస్త్రములు ధరింతుము. పాయసము మునుగునట్లు నేయి పోసికొని, ముంజేతినుండి కారుచుండగా నీతోగూడి, హాయిగా నారగింతుము. ఇదేకదా మన వ్రతము.

28. పశువుల మేపుకొన నడవికిబోయి, యందే భుజించు నజ్ఞానులమగు గొల్ల భామలము మేము. ఇట్టి గొల్లకులమున మా పుణ్యము కొలది నీవు జన్మించితివి. ఏ కొరతయులేని గోవిందుడా! నీతోడి సంబంధమును, మేమిచ్చట బోగొట్టుకొందమన్నను పోవునదిగాదు.

మేము జ్ఞాన బాలికలము. ప్రేమచే నిన్ను చిన్న పేర్లతో బిలిచితిమి కోపింపకుము. పురుషార్థములను దయచేయుము! ఇదేకదా మన వ్రతము.

29. గోవిందా! వేకువనేవచ్చి, నిన్ను సేవించుకొని, నీ శ్రీపాద పద్మములను స్తుతించుటలో, మా యుద్దేశ్యము వినుము, పసుల మేపుకొని బ్రతుకు మా కులమున బుట్టిన నీవు, అంతరంగ కైంకర్యమున మమ్ము స్వీకరింపక పోగూడదు. ఈ వాద్య విశేషాల దీసికొని పోవుటకు మేమురాలేదు. ఏడేడు జన్మలలోను నీతో సంబంధము గలవారము గానే యుందుము! నీకే మేము సేవ చేయుదుము. వేరు కోర్కెలు లేకుండ జేయుము. ఇదేకదా మన వ్రతము.

30. చంద్రముఖులు సుందరాభరణలు నగు గోపికలు, క్షీర సాగరమును జిలుకగా జనించిన లక్ష్మిని చెట్టబట్టినవాడు, కేసి రాక్షసుని జంపినవాడునగు సర్వేశ్వరునిజేరి స్తోత్రముచేసి పురుషార్థములను గ్రహించిరి. ఈ వార్తను శ్రీ విల్లిపుత్తూరులోని మాలాకారుడగు పెరియాళ్వారు యొక్క కుమార్తెయగు గోదాదేవి, ముప్పది ద్రావిడ పద్యములను రచించెను. వీనిని తప్పక యిట్లే యనుసంధించువారు, నాలుగు ఎగుభుజములు గలవాడు ఎఱ్ఱని నేత్రములు దివ్యముఖ మండలము గలవాడునగు శ్రియః పతియొక్క కటాక్షమునకు బాత్రులై మహానందము ననుభవింతురు.

## 6. కులశేఖరాళ్వారు :

ఈయన కేరళదేశములో చోళపట్టణమునందు, చేరవంశపు రాజగు దృఢవ్రతునకు కౌస్తుభాంశమున జన్మించెను. శ్రీరాముని యందు, వేంకటేశ్వరుని యందును ఈయనకు భక్తిమెండు.

ఒకసారి రామాయణము వినుచు "జనస్థానములో ఖరదూషణాదులగు పదునాల్గు వేలమంది రాక్షసులతో శ్రీరాము డొక్కడే

యుద్ధము చేయుచున్నా"డను వర్ణన రాగా, ఈయన ఆ రామచంద్రునకు సాయపడుటకై ఖడ్గకవచాదుల ధరించి జనస్థానమువైపు పరుగెత్తినాడట. శ్రీరంగమునకు బోయి ఆ పెరుమాళ్ళ సన్నిధిలోనే నివసించుటకై ప్రజలనుగూడా ప్రయాణము చేయుచుండగా, మంత్రులు రాజ్యమరాజకమౌనని యనేక పర్యాయములు విఘ్నములు గల్పించిరట.

ఈయన "పెరుమాళ్ తిరుముడి" అను ద్రావిడ ప్రబంధమును, "ముకుంద మాలాస్తోత్ర" మను సంస్కృత శ్లోకములను రచించెను. ముకుంద మాలలోని ఈ శ్లోకమునకు జాల ప్రసిద్ధి కలదు.

"దివివా భువివా మమాఽస్తు వాసో
నరకేవా నరకాంతక! ప్రకామం!
అవధీరిత శారదార విందౌ
చరణౌ తే మరణేఽపి చింతయామి"

"నన్ను స్వర్గమందే యుంచుము లేక భూమియందే యుంచుము! నరకమందైన నుంచుము. ఎక్కడనుంచినను నీ చరణారవిందములనే చింతించు చుందును. నరకముల బోగొట్టువాడా! నాకవియేచాలును." అని కులశేఖరాళ్వారు సదా పెరుమాళ్ళకు విన్నపము చేసికొను చుండువాడు. శ్రీరంగము, తిరుపతి, కంచి, తిరుకణ్ణపురము, తిరుమాలిరుంజోలై, శ్రీముష్టము, నమ్మాళ్వారవతరించిన తిరునగరి మున్నగు దివ్యదేశములు సేవించి, అరువది సంవత్సరములు జీవించి, పరమపదించెను. "పెరుమాళ్ తిరుముళి"లో 105 పాశురములున్నవి. ఇందు తిరుపతిలో తాను జన్మింపవలెనను కోర్కె తెలుపబడెను. మరియు రామావతార విషయములును గలవు. ఈయన శ్రీసూక్తి: "ఓ భగవానుడా! నే నెన్నోపాట్లు పడుచున్నాను. శరణాగత వాత్సల్యము గల నీకు శరణాగతి చేయుచున్నాను. మరొక విధముగా నా యిబ్బందులు తొలగవు. తల్లి కోపింపగా దూరముగా పోయిన

కుమారుడు, తిరిగి తల్లి పోషణమునే యపేక్షించి సమీపించునట్లు, నేను నీ యనుగ్రహమునే యపేక్షించి నీ పాదారవిందముల పొంతనే శరణు వేడుచున్నాను. (పెరుమాళ్ తిరుమొళి)

## 7. తిరుప్పాణి ఆళ్వారు [యోగి వాహనుడు]:

ఈయన శ్రీరంగము వద్దగల నిచుళాపురములో శ్రీవత్సాంశమున పరిమడిలో జన్మించెను. మాలదాసరి దంపతులకు దొరకెను. శ్రీరంగములో రంగనాయకుల కోవెలముందు వీణ వాయించుచు భగవద్గుణానుభవమును చేయుచు మైమరచుచుండువాడు. బ్రాహ్మణులు కావేరి స్నానమాచరించి వచ్చుచు అస్పృశ్యుడని యాతనిని రాళ్ళతో గొట్టిరి. దేవాలయములో రంగనాయకుల నొసటినుండి నెత్తురు కారెను. అర్చకాదులాశ్చర్యపడిరి. రంగనాయకులు సారంగ యోగి కలలో గాన్పించి "దెబ్బలుతిన్న యా మాలదాసరిని నీవు తీసికొనిరమ్ము! అతడు రాకున్న నీ వాతని నెత్తుకొనిర" మ్మని యాజ్ఞాపించెను. సారంగ యోగి మున్నగు బ్రాహ్మణులు బ్రహ్మరథము పట్టి దెబ్బలు తగిలియున్న ఆ తిరుప్పాణియాళ్వారును శ్రీరంగని కోవెలలోనికి దీసికొని వచ్చిరి. ఆ యాళ్వారు పది పాశురములచేత రంగనిస్తుతించెను. ఈ పాశురములను "అమలనాదప్పిరాన్" అను దివ్యప్రబంధమని యందురు. ఈ యాళ్వారును ఆ స్వామి తనలో నైక్యముజేసికొనెను. "అమలనాదప్పిరాన్"లో శ్రీరంగనాథుని నఖశిఖపర్యంత వర్ణన కలదు. ఈయన శ్రీ సూక్తి: స్వామీ! నాకిల్లు వాకిళ్ళు లేవు. ఆరామ క్షేత్రాలు లేవు. చుట్టపక్కములు లేరు. ఏమియును లేవు. కరుణార్ద్ర హృదయుడవగు నీ వొక్కడవే నా కాత్మ బంధువువు. క్షణభంగురమగు నా జీవితమున నింతవరకు నీ పాదపద్మముల సన్నిధిని శరణుబొందనైతినని యిపుడెంతో చింతించుచుంటిని. నీవుతప్ప నాకాధార మెవరున్నారు?"

## 8. తొండరడిప్పొడి యాళ్వారు [విప్రనారాయణుడు] :

ఈయన బ్రాహ్మణుడు. చోళదేశములో మండంగుడి గ్రామములో వన మాలాంశమున జన్మించెను. బ్రహ్మచారి. శ్రీరంగములోని స్వామికి మాలా కైంకర్యము చేయువాడు.

దేవదేవియను వేశ్యాంగన తన అక్కతో ఈ బ్రహ్మచారిని వశపరచుకోగలనని పంతమాడినది. ఒకనాడామె వర్షమునకు దడియుచు ఆ యాళ్వారు తిరుమాళిగకు వచ్చినది. ఆళ్వారు గజగజవణకుచున్న యామెను గనికరించి యాశ్రయమిచ్చెను. ఇంకేమున్నది! క్రమముగా నామె యాళ్వారును వశపరచుకొనెను. ఇట్లు కొన్ని రోజులు గడిచినవి. తర్వాత ఆళ్వారు ఆ వేశ్యాంగన యింటికేపోవ మొదలిడెను. వేశ్యమాత ధనమీయలేని వట్టి దరిద్రుడని వెళ్ళగొట్టుగా, దానిపోరు పడలేక దీనుడై అతడారాత్రి యా వేశ్యాంగణమందే పడియుండెను. మరునాడు రంగనాయకులా భక్తుని గనికరించినాడేమో "నేను ఆ యాళ్వారు దాసుడనని చెప్పుకొనుచు వచ్చి దేవళములోనున్న బంగారు గిన్నె నొకదాని నా వేశ్యమాత కిచ్చిపోయెను. రాజభటులా బంగారు పాత్రతో సహా ఆళ్వారుని బట్టుకొనిపోయి రాజుముందు నిలిపిరి. రాజాళ్వారుని శిక్షింప జూచెను. రంగనాయకులా రాజు స్వప్నమందు గనబడి యధార్ధ స్థితిని వినిపించెను. రాజా యాళ్వారును సగౌరవముగా విడిచిపెట్టెను. అప్పటినుండి యాతడు సజ్జనుడుగా జీవించెను. పశ్చాత్తాపముచే బరిశుద్ధుడై అత్యంత భక్తుడై వర్తించెను. ఆయన "తిరుప్పళ్ళడిచ్చి", "తిరుమాలై" అను రెండు ప్రబంధములు రచించెను. "తిరుమాలై"లో 45 పాశురములున్నవి. ఇందు ఆత్మనివేదనము తెల్పబడెను. "తిరుప్పళ్ళి యెళుచ్చిలో" 10 పాశురములున్నవి. ఇందు భగవంతుని మేల్కొల్పులున్నవి. ఈయన శ్రీసూక్తి : "అమృతము వంటివాడు రస స్వరూపుడునగు భగవంతుని సేవించిన నాకన్న లన్య పదార్థములను జూడనొల్లవు."

## 9. తిరుమంగై యాళ్వారు [పరకాలుడు] :

ఈయన చోళదేశములోని తిరుక్కురయులూరు' న, శూద్రుడు శైవుడునగు 'తిరువాలినాడుడై యారు' నకు శార్ఙ్గ అంశమున జన్మించెను. పండితుడు ధనుర్విద్యా పారంగతుడునై ఒక పరగణాకు పన్నులు వసూలుచేయు నధికారిగా నుండెను. ఒక వైద్యుడు, అప్సరసలు వదలిపోయిన యొక బాలికను గొనిపోయి పెంచగా, ఆమెనుజూచి యీ యాళ్వారు ప్రేమించెను. ఈ బాలిక పేరు కుముదవల్లి. ఈమె పంచ సంస్కారములు పొంది రోజుకు వేయిమంది వైష్ణవులకు భోజనము పెట్టినవానిని పెండ్లాడుదునని యీ యాళ్వారునకు జెప్పెను.

ఈయనయును పంచసంస్కారపరుడై అట్లే భాగవతారాధన చేయుచుండెను. రాజునకీయవలసిన కప్పము డబ్బుగూడ ఖర్చు పెట్టెను. రాజీయనను గెలువలేక మంచి మాటలతో నొక దేవాలయంలో బంధించెను. భగవంతు డాళ్వారు స్వప్నములో గనబడి "కాంచీపురమునకు రమ్ము. ఆ ధనము నందింతు" నన్నాడు. ఈ రీతిగా నీయన ధనమీయ గలిగినందులకు ఆ రాజు మెచ్చి తదీయారాధనము నకే యా ధనము నాళ్వారున కిచ్చివేసెను.

తిరుమంగై యాళ్వారు కుముదవల్లిని వివాహమాడెను. భాగవతారాధనకై యాయన దాళ్లుకొట్టి, కన్నాలువేసి, దొంగతనములు కూడ చేసెను. ఒకనాడీయన రాత్రివేళ వేచియుండి, ఒక యిల్లాలు వెండిపళ్ళెమును తోముచుండగా దానిని గుంజుకొని పోవుచుండెను. ఆ యిల్లాలు "అస్మద్గురుభ్యోనమః" అన్నది. అతడు ఇది వైష్ణవుల యిల్లు కాబోలునని ఆ పళ్ళె మచ్చటనే పడవేసిపోయెను.

శ్రీరంగనాయకు లీయాళ్వారు ననుగ్రహింపదలచి నూతన వధూవరుల వేషముతోవచ్చి యడవిలో నతని గలసికొనిరి. ఆ యాళ్వారు వారి నగలొలుచుకొని రంగనాథుని వేలి యుంగరమును

దీయ యత్నించెను. అది యే విధముగాను రాలేదు. ఆళ్వారు రంగ నాథుని వ్రేలుకొరికి "మంత్రము వేసితివా" యని యడగును. రంగ నాయకుడా మంత్రము వినుమని పెరియ తిరుమంత్రము నుపదేశించెను. ఆళ్వారు ధన్యుడనైనా ననుకొనెను. అతడప్పటినుండి భారతదేశము లోని దివ్యదేశముల నన్నిటిని సేవించి, ఆయా భగవ ద్విగ్రహములను పదేసి పాశురములతో స్తుతించెను. ఈయన 6 గ్రంథములు రచించెను. 1 'పెరియతిరుమొళి'లో 1084 పాశురములున్నవి. తాను సేవించి స్తుతించిన స్తోత్రములు దీనిలోనివే. తన చెడుపనులకు పశ్చాత్తాపపడి భగవత్పాదారవిందముల ముందు నాత్మ సమర్పణము చేసినట్లు ఆ యాళ్వారే వ్రాసుకొన్నాడు. తత్త్వ రహస్యములను గూడ జక్కగా పొందుపరచినాడు. 2. 'తిరుక్కురుందాండకం'లో 20 పాశురము లున్నవి. 3. 'తిరునెడందాండకము'లో 30 పాశురములున్నవి. ఇందు మోహంవిడచి శరణాగతి చేసినందుకు పొందు నుపయోగము తెల్పబడెను. 4. 'తిరువెళుకూత్తిరుక్కై' 5. 'శిరయ తిరుమడల్' 6. 'పెరియ తిరుమడల్' అను గ్రంథములను వ్రాసెను. ఈ యారు గ్రంథములును వేదాంగములుగా బరిగణింపబడినవి. మిగిలిన యాళ్వార్లకంటె నధికముగా పాశురములను వ్రాసినవాడీయనయే.

## 10. నమ్మాళ్వారు [శఠకోపుడు] :

విష్వక్సేనుడు నమ్మాళ్వారుగా బుట్టి "విష్ణు భక్తి ప్రచారము చేయు"నని భవిష్యపురాణములో గలదు. "నమ్మాళ్వారు జన్మస్థానము శ్రీనగరి (తిరునగరి)" యని బ్రహ్మాండపురాణములో గలదు. కలి కాలమున దక్షిణదేశ నదీతీరములందు శ్రీమన్నారాయణుని భక్తులైన సిద్ధపురుష (ఆళ్వారు) లవతరింతురని భాగవతములోను గలదు. ఈయనను వకుళాభరణుడు పరాంకుశుడు ననియు నందురు. పాండ్య దేశములోని తిరుక్కురు గూరిలో విష్వక్సేనాంశమున ఉదయనంగ- కారియను దంపతులకు జన్మించెను. పుట్టుకతోడనే యోగియై కనులు

మూసుకొని యుండెను. అతనిని తలిదండ్రులు ఆదినాథుని దేవాలయము నకు గొనిపోగా అచటి చింతతొఱ్ఱలో ఆ బాలుడు దూరి కూర్చుండెను. తపస్సు చేయుచున్న యీయన తేజస్సును దూరమునుండియే చూచి మధురకవి యాళ్వారు వచ్చెను. అతడు, నమ్మాళ్వారునకు అసలు కన్నులున్నవో లేవో పరీక్షించుటకై యొక బండను బగులగొట్టి చప్పుడు చేసెను. నమ్మాళ్వారు కన్నులు తెరచిచూచెను. మధురకవి యీయనకు జ్ఞాన మెంతయున్నదో పరీక్షించుటకు

> "అచిత్తుయొక్క కడుపులో చిన్నది పుట్టిన
> యెడల, దేనిని తిని యెక్కడ నుండును స్వామీ?''

అని యడిగెను, నమ్మాళ్వారు :

"దానిని తిని అక్కడనే పడియుండు" నని సమాధానించెను. అనగా "ఆత్మ శరీరగతమై, శరీరగత సుఖదుఃఖముల ననుభవించుచు, శరీరమునే యాశ్రయించి యుండు"నని యర్థము. అచిత్తు = దేహము, చిన్నది = ఆత్మ. ఆ మధురకవి యా నమ్మాళ్వారుల ప్రభావమును ప్రకటించెను. సామాన్యముగా శిశువు పుట్టుటతోడనే అతనిని శఠమను వాయువు కప్పును. కాన శిశువునకు లోకజ్ఞాన ముండదు. నమ్మాళ్వారును శైశవమున అట్టివాయువు కప్పలేదు. అట్లు శఠవాయువును జయించుటచేత నాయనకు శఠకోపులను బిరుదు వచ్చెను. శఠులందు కోపపడు వాడు గావునను ఆయనను శఠకోపు లందురు.

నమ్మాళ్వారు నాలుగు ప్రబంధములు రచించెను. 1. "తిరు విరుత్తం", 2. ''తిరువాశిరియం". 3. "పెరియ తిరువందాది", 4. "తిరువాయి మొళి." ఈ నాల్గు గ్రంథములను ''నాలాయిర" మందురు. 1. తిరువిరుత్తములో ఋగ్వేదసారమును చెప్పు 100

పాశురములున్నవి. 2 "తిరువాయి మొళి"లో యజుర్వేద సారమును దెల్పు 7 పాశురములున్నవి. 3. "పెరియ తిరువందాది"లో అథర్వణ వేద సారము దెల్పు 87 పాశురములున్నవి. 4. "తిరువాయి మొళి" (= మహనీయుని దివ్య వాణి)లో సామవేదసారమును దెల్పు 1102 పాశురము లున్నవి. ధర్మములు, భక్తి ప్రపత్తులు, నాయకీనాయకుల విరహమును దెల్పబడినవి. ఈయనకు "శ్రీవైష్ణవ కులపతి" యను బిరుదముకలదు. మార్కండేయ పురాణములోను ఈ నమ్మాళ్వారు ప్రభావము కలదు. ఈయన ప్రబంధములకు "ద్రావిడ వేదసాగర" మను పేరుగలదు. ద్రావిడ భక్తి వాఙ్మయమునకిది కాణాచి.

## 11. మధురకవి యాళ్వారు :

ఈయన పాండ్యదేశములో 'కోళూరు' నందు పురశిఖ బ్రాహ్మణుడగు నారాయణు డనువానికి శ్రీ సేన మొదలియాళ్వారి గణాధిపతులలోని కుముదుడను వాని యంశమున జన్మించెను. ఈయన వేదవేత్త, యోగి, భక్తుడునై, దివ్యదేశయాత్రలు చేయుచు నొకరాత్రి యొక్క గొప్ప తేజస్సును జూచెను. అదేమిటో తెలిసి కొనుటకై తిరుపతి శ్రీరంగముగుండా, తిరుక్కురు గూరు చేరువరకు ఆ తేజస్సు కానరాలేదు. అచటి అదిప్పిరాన్ కోవెల దగ్గర చింతచెట్టు తొఱ్ఱలో నీ నమ్మాళ్వారును జూచెను. ఈయనదే ఆ తేజస్సని కని పెట్టి, ఆయన గొప్పతనమును బరీక్షించి తెలిసికొని సేవచేసి, యనేక విషయములను గ్రహించెను. ఆ నమ్మాళ్వారు ప్రభావమును "కణ్ణినుణ్ శిరుత్తాంబు" అను ప్రబంధముగా వ్రాసెను.

'కుదకాణ' పురమునందు నమ్మాళ్వారి విగ్రహమును ప్రతి ష్ఠించి ఈ మధురకవి యాళ్వారు కాహళు లూదించెను. కంబకవీశ్వ రుని శిష్యులు "మా గురువును మీ నమ్మాళ్వారు జయించువరకు మీ విజయకాహళు లూదించ వ" ద్దన్నారు. మధురకవి : "మా గురువు

సంవత్సర చైత్రశుద్ధ పంచమీ ఆర్ద్రా నక్షత్రమున శేషాంశమున జన్మించెను. యాదవప్రకాశుడను నద్వైతి గురువువద్ద శాస్త్రాధ్యయనము చేసెను.

ఒకనాడు రామానుజుడు యాదవప్రకాశునకు తలయంటుచుండగా నా గురువు విద్యార్థులకు ఛాందోగ్యోపనిష త్స్వారము చెప్పుచుండెను. అందు

"తస్య యథా కప్యాసం
పుండరీక మేవ మక్షిణీ"

అను దానికి భగవంతుడు కోతి పిర్రలవంటి కనులు గలవాడని అర్థము చెప్పుచుండెను. అది వినుచున్న రామానుజుల కనులనుండి వేడి కన్నీటిచుక్కలు గురువు తొడమీద బడినవి. గురువు పైకిచూచి దుఃఖ కారణ మడుగగా రామానుజుడు :

"కం జలం పిబతీతి కపిః = సూర్యః
తేన అస్యతే వికాశ్యతే ఇతి = కప్యాసమ్"

సూర్యునిచే వికసింపజేయబడిన పుండరీకములవంటి కనులు గలవాడు భగవంతుడు అని యర్థము చెప్పకపోతిరే యని నాకు కష్టమనిపించిన దనెను. గురువు తనను తన శిష్యుడగు రామానుజుడు మించిపోయినాడను నసూయతో నతని జంపదలచెను. రామానుజుడు తప్పించుకొనెను.

తర్వాత శ్రీరంగములో యామునాచార్యులను దర్శింపబోయెను. వారప్పుడే పరమపదించి యుండిరి. రామానుజుడు వారి భౌతిక దేహమును జూచెను. కుడిచేతివేళ్ళు మూడును ముడుచుకొని యుండుటను కనుగొనెను. రామానుజుడు మీకోర్కె ప్రకారము,
1. విష్ణుపురాణమును వ్రాసిన పరాశరుని పేరు మనలో నొకరికి పెట్టుదును. 2. వ్యాస సూత్రములకు శ్రీభాష్యము వ్రాసెదను,

3. నమ్మాళ్వారు వ్రాసిన 'తిరువాయి మొళి'కి వ్యాఖ్యానము వ్రాసెదను. అని యా భౌతిక దేహము ముందు ఒప్పుకొనగా ముడిచియున్న మూడు వేళ్ళును విచ్చుకొన్నవి. రామానుజుడు పెరియనంబి (- మహాపూర్ణులు) వద్ద పంచసంస్కారములు పొంది, తిరుక్కోట్టియూర్ నంబి (- గోష్ఠిపూర్ణులు), పెరియతిరుమలనంబి (- శ్రీశైలపూర్ణులు) తిరుకచ్చినంబి కాంచీపూర్ణులు (- తిరుమాలై యాండాన్) (- మాలాధరులు) అను వారిని గూడ ఆచార్యులనుగా జేసికొనెను.

జైన బౌద్ధ క్షపణకాది మతస్థులను వాదమునందు జయించి విశిష్టాద్వైతమును ప్రచారము చేసెను. 'యజ్ఞమూర్తి' యను ఏక దండ సన్యాసిని జయించి శిఖా యజ్ఞోపవీతములతోడి త్రిదండ సన్యాసిగా జేసెను. రామానుజుని ముఖ్యశిష్యుడు కూరత్తాళ్వారు.

ఈ రామానుజులు బ్రహ్మసూత్ర భాష్యము, వేదాంతసారము, వేదాంత దీపము, వేదార్థ సంగ్రహము, శ్రీరంగ గద్యము, వైకుంఠ గద్యము, శరణాగతి గద్యము, 82 వార్తలను గ్రంథములను రచించెను. డెబ్బది రెండు పీఠాధిపతుల నేర్పరచెను. నూట యిరువది సంవత్సరములు జీవించి పరమపదించిరి.

# రామానుజ వార్తా సంగ్రహము

రామానుజులు పరమపదమునకు బోవుచు, సకల చేతనోజ్జీవనార్థము సర్వశాస్త్ర సారమగు శ్రీవైష్ణవ సాంప్రదాయమును ఐహికాముష్మిక సుఖప్రాప్తికై తమ శిష్యులకు ఎనుబదిరెండు వార్తలుగా నందించిరి. శ్రీవైష్ణవులు వీరి యీ యంత్యసందేశమును శిరసా వహింతురు గాక.

1) భగవద్భాగవతాచార్య కైంకర్యమందే నిష్ఠగల్గి, వారి శ్రీ సూక్తులందు విశ్వాస ముంచవలెను.

2) ఇంద్రియములకు దాసులుగాక, భగవద్విషయమందే కాల క్షేపము చేయవలెను.

3) ఆచార్య సమాశ్రియణము ద్వారా జ్ఞానులై, తిరుమంత్ర ద్వయమంత్ర చరమశ్లోక రూపమగు భగవన్నామోచ్ఛా రణము చేయుచుండవలెను.

4) మేల్కొన్న వెంటనే, గురు పరంపరానుసంధానము చేయ వలెను.

5) శ్రియఃపతి విమాన గోపురాదులు కనబడిన వెంటనే నమస్కరింపవలెను.

6) శ్రీవైష్ణవుల గుణముల బొగడవలెగాని దోషముల దడువ రాదు.

7) విష్ణ్వాలయములందు, ప్రాకృతులు చూచుచున్నను తనకు నుపవాసాది నియమము లున్నను, ప్రసాదము స్వీకరింప వచ్చును.

8) భాగవతుల విమర్శించు వారితో సంభాషింపరాదు.

9) తత్వ త్రియ రహస్యత్రయ జ్ఞానము గలవారితో, సహ వాసము చేయవలెను.

10) భగవన్నివేదితముగాని భోజనాదుల స్వీకరింపరాదు.

11) శాస్త్రీయ కర్మలను కైంకర్యబుద్ధితో జేయవలెను.

12) భగవత్ - మంత్ర - విగ్రహములయందు వైష్ణవ - ఆచార్యుల యందు, శ్రీపాదతీర్థమందును సామాన్యబుద్ధి నరక హేతువు.

13) భగవ ద్భాగవతారాధనలు తన యదృష్ట ఫలితములని తలంపవలెను.

14) ప్రపన్నుడు తన కర్మాధీన దేహయాత్రను నీచముగా దలపరాదు.

15) కర్మలను భగవత్కైంకర్య బుద్ధితో జేయవలెను.

16) రామానుజ శ్రీభాష్యమును పన్నిద్దరాళ్వార్ల దివ్యప్రబంధములను సేవించు చుండవలెను.

17) దివ్యదేశములందలి దేవాలయాలంకరణమో, దీపాలంకరణమో, పుష్పమాలా కైంకర్యమో చేయుచుండవలెను.

18) యాదవాద్రియందు సత్యనివాసము చేయుట మంచిది.

19) పై వాని నాచరించు నవకాశము లేనివారు, భాగవతోత్తముల సన్నిధానమందు నివసించుట మంచిది.

## నవ విధ భక్తులు

శ్రీమద్భాగవతములో నవవిధ భక్తులు తెల్పబడినవి.

"శ్రవణం కీర్తనం విష్ణో స్స్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్"

1) శ్రవణ మనగా, భగవదనుగ్రహము నపేక్షించుచు నాతని నామ రూప గుణలీలా కథా మహాత్మ్యములను వినుట.

2) కీర్తన మనగా, భగవంతుని నామరూప సర్వవ్యాపకత్వాదుల గాన మొనర్చుట.

3) స్మరణ మనగా, భగవంతుని గుణ నామ రూప సర్వవ్యాపకత్వాదుల స్మరించుట.

4) పాదసేవన మనగా, భగవంతుని శ్రీ పాదములను వత్తు చున్నట్లు, పూజించుచున్నట్లు, మనస్సున దలంచుట, అర్చా మూర్తి పాదపూజ చేయుట.

5) అర్చన మనగా, భగవదర్చా రూపములను అంగములను కుంకుమతో అక్షతలతో పుష్పములతో బూజించుట సహస్ర నామ అష్టోత్తర నామాదులచే త్రికరణశుద్ధిగా బూజించుట షోడశోపచార పూజయగును.

"పత్రం పుష్పం ఫలం తోయం యోమే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః" (గీత)

"పత్రముగాని, పుష్పముగాని, ఫలముగాని, జలముగాని ఎవడు నాకు భక్తితో సమర్పించునో అట్టి పరిశుద్ధాత్ముడిచ్చిన యా వస్తువుల, నేననుభవింతును" అని భగవానుడేయన్నాడు. మానసిక పూజయును ఈ యర్చన క్రిందికే వచ్చును.

6) వందన మనగా, భగవన్మహిమనే తలంచుచు నమ్రుడై భగ వంతునికి నమస్కరించుట, అంజలించుట.

7) దాస్య మనగా భగవద్భాగవతాచార్యుల యానతిని శిరసా వహించి కింకరుడై తదనుకూలముగా సేవించుట.

8) సఖ్యమనగా, స్నేహితునకు సులువుగా దన మనోభిప్రాయము దెల్పునట్లు భగవంతుని సన్నిధానములో దన మనోభిప్రాయ మును వెల్లడించుట. నిర్భయముగా రక్షింపుమని బ్రతి మాలుకొనుట.

9) ఆత్మనివేదన మనగా, నేను నీవాడనేయని తన నా భగవంతుని ముందు - సమర్పించుకొనుట. దీనిని ప్రణిధాన మని, ప్రపత్తియని, భరన్యాసమని, శరణాగతియనియు నందురు.

ఆళ్వార్లందరును ఈ నవవిధభక్తుల గూర్చి తమ గ్రంథము లందు జక్కగా దెల్పినారు. ఈ యాళ్వారుల ననుసరించి రామానుజులును భక్తి ప్రపత్తులకే భగవంతుడు సాధ్యుడని తమ గ్రంథము లందు దెలిపిరి. శరణాగతి గద్య, వైకుంఠగద్య, రంగరాజగద్యలు భక్తులు భగవంతు ననుసంధించుటకై రచించిరి.

రామానుజ కాలానంతరమున శ్రీవైష్ణవము వడగలై – తెంగలై యను రెండు శాఖలైనది. భగవదనుగ్రహము సహేతుకమని తలంచువారు వడగలైశాఖవారు. నిర్హేతుకమని తలంచువారు తెంగలైశాఖవారు. వడగలైశాఖయొక్క ప్రపత్తి మార్గమునకు ఉదాహరణము మర్కట కిశోర న్యాయము. తెంగలై శాఖయొక్క ప్రపత్తిమార్గమున కుదాహరణము మార్జాల కిశోరన్యాయమునని యందురు.

## అర్థపంచక జ్ఞానము

విశిష్టాద్వైత సాంప్రదాయము వారికి అర్థపంచక జ్ఞాన మత్యావశ్యకమైనది.

1) ఆత్మస్వరూపజ్ఞానము – జీవుడు భగవంతునకే దాసుడై యుండును. "శేషత్వమాత్మాపుకుక్క స్వరూపం" అని తెలిసికొని యుండుట.

2) పరమాత్మ స్వరూపజ్ఞానము – భగవంతుడు జీవుల నన్నివిధముల రక్షించువాడై యున్నాడని తెలిసికోనుట.

3) ఫల స్వరూపజ్ఞానము – సంపాదించవలసినది మోక్షమని తెలిసికొని యుండుట.

4) ఉపాయ స్వరూపజ్ఞానము – భగవంతుడే గతియని నమ్మి శరణాగతి చేయుట.

౫) విరోధి స్వరూపజ్ఞానము - మోక్షమున కాటంకము గల్గించు వాని నెరిగి యుండుట.

ఈ యైదర్థములును తిరుమంత్రమునందు చక్కగా నిమిడి యున్నవి. తిరుమంత్రమును మించిన మంత్రము లేదు. ఇది వేద సంబంధ మంత్రము. ఆచార్యులను సమాశ్రయించి యీ మంత్రము నుపదేశము పొందవలెను. ఈ మంత్రము ననుష్ఠించుటకు నన్ని వర్ణముల వారికి నధికారము కలదు.

## నవ విధ సంబంధములు

జీవాత్మకు పరమాత్మకును నవవిధ సంబంధము లున్నవి.

"పితాచ రక్షక శ్శేషీ భర్తా జ్ఞేయో రమాపతిః
స్వామ్యాధారో మహాత్మాచ భోక్తాచాద్య మనూదితః"

1) పితాపుత్ర సంబంధము : తండ్రికి కుమారునకు గల సంబంధమువంటి సంబంధము జీవాత్మకు పరమాత్మకును గలదు. కోరకున్నను కుమారుల క్షేమమునకై తగిన కార్యములు చేసి తండ్రి రక్షించునట్లే జీవుల యోగక్షేమముల నతడు వహించును.

"సర్వయోనిషు కౌంతేయ మూర్తయస్సంభవంతియాః
తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజ ప్రదః పితా" (భ. గీత)

అర్జునా! అన్ని యోనులందు నేయే యాకారములు పుట్టు చున్నవో వానికన్నిటికి ప్రకృతి తల్లి. దానియందు బీజముంచు తండ్రిని నేనే.

2) రక్ష్య రక్షక సంబంధము : రక్షించు వానికి రక్షింపబడు వానికి గల సంబంధము. భగవంతుడు సర్వరక్షకుడు. శరణు వేడిన, మిత్రుడేకాదు శత్రువునైనను రక్షించువాడు.

"సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి య యాచ తే
అభయం సర్వభూతే భ్యో దదామ్యేత ద్వ్రతం మమ"
అన్నాడు శ్రీరామావతారమున భగవంతుడు.

"సర్వజ్ఞ స్సర్వగో భువనస్య గోప్తా" (శ్వేతా) (ఉ.)
సర్వజ్ఞుడు సర్వవ్యాపియునగు భగవంతుడే ప్రపంచ రక్షకుడు.

3) శేష శేషి సంబంధము : (శేషుడు = సేవకుడు). జీవుడు పరమాత్మ యధీనమందుండి యాయన వినియోగమునకు లోబడి యుండువాడు. జీవులందరి సేవను బొందువాడు పరమాత్మ! కావున, పరమాత్మ శేషిశేషత్వము జీవాత్మయొక్క స్వరూపము. "శేషత్వమాత్తా పుక్కు స్వరూపం" అని తిరుమంత్రార్థము చెప్పును.

"భీషా స్మాద్వాతః పవతే భీషోదేతి సూర్యః
భీషా దగ్నిశ్చేంద్రశ్చ మృత్యుర్ధావతి పంచమః (తై) (ఉ)

భగవత్సేవకు లోపమగునను భయముచేతనే, వాయు సూర్య వహ్ని దేవేంద్ర యమధర్మరాజులందుగల జీవులు, తమ తమ నిర్ణీత కార్య క్రమమును విడువక చేయుచున్నారు.

4) భర్తృభార్యా సంబంధము : భార్య నన్ని విధాల సంతోష పెట్టుచు భరించువాడు భర్త. భరింపబడుచు తదనుకూలముగా నుండ వలసినది భార్య. జీవుడు "తనను భరింపజాలినవాడు శ్రీమన్నారాయ ణుడు తప్ప మరొకడు లేడని తలంపవలెను. ఇట్టి సంబంధమునే భర్తా భార్యా సంబంధమందురు.

ఆ పరమాత్మ తానే రెండుగా నైనాడట. ఒక భాగము పతి. రెండవ భాగము పత్ని.

"స ఏకాకీ నరమతే! స ద్వితీయమైచ్ఛత్
సః పతిశ్చ పత్నీ చా భవతామ్"

# శ్రీమన్నారాయణుడే పరతత్వము

ఆ భగవంతు డొకడే పురుషుడు. బ్రహ్మ మొదలు తక్కిన ప్రపంచమంతయు స్త్రీ ప్రాయమే.

"స్త్రీ ప్రాయ మితరం సర్వం జగత్. బ్రహ్మ పురస్సరమ్" అనిగదా ప్రమాణము. అతడు జగన్నాథుడు.

5) జ్ఞాతృ జ్ఞేయ సంబంధము - (జ్ఞాత) తెలిసికొనువాడు జీవుడు. (జ్ఞేయుడు-) తెలియబడువాడు - భగవంతుడు. నిత్యుడు ఆత్మయందుడువాడునగు భగవంతుడు తెలియదగినవాడు. ఈతని కన్న తెలిసికొనదగినది వేరేదియును లేదు.

"నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్"

తెలిసికోదగిన వానిలో గొప్పవాడు. సమస్త ప్రపంచమునకు నాత్మయై యుండువాడు. భూతకోటికి పరమగమ్య స్థానమైనవాడు నారాయణుడు.

6) స్వ స్వామి సంబంధము : స్వ = సొమ్ము జీవుడు (స్వామి) సొమ్ముగలవాడు భగవంతుడు. సొమ్ముగలవాడు దానిని పదిలపరచి రక్షించి చెడకుండగా పాడి వృద్ధిపరచి తనకు సంతోషకరముగా నుపయోగించుకొనును. అట్లే భగవంతుడును జీవుని రక్షించి, యతని యోగక్షేమమును వహించి తన ప్రయోజనమునకు వినియోగించుకొనును. భక్త రక్షణమే భగవంతునికి ప్రయోజనము, కాన తన రక్షకత్వమును స్థాపించుకొనుటకై జీవుల రక్షించును.

"పతిం విశ్వస్యాత్మేశ్వతగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతమ్"

సమస్త ప్రపంచమునకు స్వామియై జీవాత్మకు నాయకుడై నిత్యుడై మంగళకరుడై శ్రీమన్నారాయణు డుండును. ప్రకృతి జీవులకు పతియై కళ్యాణగుణములు గల యీశ్వరుడై యుండును.

7) ఆధారాధేయ సంబంధము : ఆధారము = ఏదేని యొక పదార్థమును ధరించునది. పరమాత్మ ఆధేతము ధరింపబడు పదార్థము. జీవుడు, జలమున కాధారము పాత్రయైనట్లు జీవున కాధారము పరమాత్మ. అధేయము జీవుడనవలెను. ఇట్టి సంబంధమును ఆధారాధేయ సంబంధ మందురు. సర్వాధారుడు పరమాత్మయని నమ్మియుండవలెను.

8) శరీర శరీరి సంబంధము : సర్వ వస్తువులందుండు పరమాత్మ ఆత్మయందుగూడ నున్నాడు. కావున పరమాత్మకు జీవాత్మ శరీరము. పరమాత్మ శరీరము గలవాడు = (శరీరి) అట్టి సంబంధమును శరీర శరీరి సంబంధ మందురు. శరీరము జీవాత్మ మేలునకే యైనట్లు జీవాత్మ పరమాత్మ మేలునకే యున్నాడు. జీవుని విడచిన దేహము వెంటనే యెట్లు నశించునో అట్లే దేవుని విడచిన జీవుడు నశించును. భగవచ్చింతనము లేక యుండుటే భగవంతుని విడచి యుండుట, ఇట్టి జీవుడు అథోగతి పాలగును. ఎట్లు జీవుడు దేహమంతట వ్యాపించి యున్నాడో యట్లే భగవంతుడు జీవాత్మయందు వ్యాపించి యున్నాడు. ప్రపంచమంతయు భగవంతుని శరీరమే కదా!

"సర్వగ్ం హ్యేతద్ బ్రహ్మ" (మాండూక్య) (ఉ)
యస్యాత్మా శరీరం" (బృ, ఉ.)

9) భోక్త భోగ్య సంబంధము : భోక్త ("జీవుడు చేయు పరిచర్యాదుల ననుభవించువాడు) భగవంతుడు భోగ్యము - అనుభవించబడు వస్తువు జీవాత్మ. అదెట్లనగా, యజ్ఞ యాగాదుల ద్వారా చేయబడు సేవల ననుభవించువాడు భగవంతుడు. భోగ్యము జీవుల సేవ.

"భోక్తారం యజ్ఞతపసాం" (గీత)

## ఆళ్వార్ల తిరునక్షత్ర శ్లోకములు

1) పొయిగై యాళ్వారు :

"తులాయాం శ్రవణే జాతం, కాంచ్యాం కాంచన వారిజాత్,
ద్వాపరే, పాంచజన్యాంశం సరోయోగిన, మాశ్రయే" ॥

2) పూదత్తాళ్వారు :

"తులా ధనిష్ఠా సంభూతం భూతం కల్లోల యోగినం,
తీరే ఫుల్లోత్పలే మల్లా పుర్యా, మీడే గదాంశజమ్" ॥

3) పేయాళ్వారు :

"తులా శతభిష గ్జాతం, మయూర పురికైరవాత్,
మహాంతం మహ దాఖ్యాతం వందే శ్రీ నందకాంశజమ్" ॥

4) తిరుమడిశై ఆళ్వారు :

"మఖాయాం మరిరే జాతం చక్రాంశం భార్గవోత్తమం,
మహీసార పురాధీశం భక్తిసార, మహం భజే" ॥

5) పెరియాళ్వారు :

"జ్యేష్ఠ స్వాతీభవం, రథాంశం ధన్వినః పురే,
ప్రపద్యే, శ్వశురం విష్ణోః, విష్ణుచిత్తం పురశ్శిఖమ్" ॥

6) కులశేఖరాళ్వారు :

"కుంభే పునర్వసౌ జాతం, కేరళే చోళ పట్టణే,
కౌస్తుభాంశం ధరాధీశం కులశేఖర, మాశ్రయే" ॥

7) తిరుప్పాణి ఆళ్వారు :

"వృశ్చికే రోహిణీ జాతం, శ్రీపాణిం నిచుళా పురే,
శ్రీవత్సాంకం గాయకేంద్రం మునివాహన, మాశ్రయే" ॥

8) తొండరడిప్పొడి ఆళ్వారు :

"కోదండే జ్యేష్ఠ నక్షత్రే, మండంగుడి పురోద్భవం,
చోళోర్వ్యాం వనమాలాంశం భక్తపదేణు, మాశ్రయే" ॥

9) తిరుమంగై ఆళ్వారు :
"కార్తికే కృత్తికా జాతం, చతుష్క విశిఖా మణిం,
షట్ప్రబంధ కృతం, శార్ఙ్గమూర్తిం కలిహ, మాశ్రయే" ॥

10) నమ్మాళ్వారు :
"వృషభేతు విశాఖాయాం, కురికాపురి కారిజం,
పాండ్యే దేశే కలే రాదౌ, శఠారిం సైన్యపం, భజే" ॥

11) మధురకవి యాళ్వారు :
"చైత్రే చిత్తా సముద్భూతం, పాండ్యదేశే, గణాంశ జం
శ్రీ పరాంకుశ సద్భక్తం మధురం కవి, మాశ్రయే" ॥

12) రామానుజులు :
"మేషార్ద్రా సంభవం, విష్ణో ర్దర్శన స్థాప నోత్సుకం,
తుండీర మండలే శేష మూర్తిం రామానుజం, భజే"

# రహస్య త్రయము

## తిరుమంత్రార్థము

మోక్షము గోరువారు తెలిసికోవలసిన రహస్యాలు మూడు. అందులో మొదటి రహస్యము తిరుమంత్రము. రెండవ రహస్యము ద్వయమంత్రము. మూడవ రహస్యము చరమశ్లోకము. ఇప్పుడు తిరుమంత్రము గూర్చి తెలిసికొందము. తిరుమంత్రి మనగా శ్రేష్ఠమైన మంత్రము. దీని గొప్పతనము తెలిసికొని, తగిన భక్తిశ్రద్ధలతో దీని చింతనము చేయవలెను. ఈ మంత్రమందు, ఈ మంత్రమందలి భగ

వంతునియందు, మంత్రముపదేశించిన ఆచార్యుల యందును ఎంత భక్తిశ్రద్ధలు చూపిన, అంత లాభము కలుగును.

సంసారులు భగవంతుడు ప్రభువని తాము సేవకుల మనియు మరచి, భగవంతుని సేవించు భాగ్యమును బోగొట్టుకొని, పోగొట్టు కొంటిమే యను దుఃఖమును లేక సంసార సముద్రంలోబడి కొట్టుక లాడుచున్నారు. భగవంతుడు దయామయుడు గనుక, వీరు తనను తెలిసికొని మోక్షము బొందుటకు వీలు గలిగించెను. తానే బదరి కాశ్రమమున నారాయణుడుగా బుట్టి, తన యంశమున బుట్టిన నరు నకు మొట్టమొదట నీ మంత్ర ముపదేశించెను.

ఇట్లా భగవంతుడే ఆచార్యుడు శిష్యుడునై, తిరుమంత్రము నందరకు దెలియజేసెను. శిష్యు డుండవలసిన విధానము కూడ లోకమునకు దెలియవలెనుగదా! అందుకనే శిష్యుడుగాకూడ నైనాడు. స్వయముగా పాటుపడి ధనము సంపాదించుకొను టెంత కష్టమో, సర్వ శాస్త్రములు చదివి వానిద్వారా జ్ఞానము సంపాదించుకొనుటంత కష్టము. తాతతండ్రులు సంపాదించిపెట్టినధన మువలె తిరుమంత్రము వల్ల గల్గు జ్ఞానము సులభము. భగవంతుని గూర్చిన మంత్రా లనేకము లున్నవి. వానిని ముఖ్యముగా రెండు విధము లనవచ్చును.

1) వ్యాపక మంత్రములు.

2) అవ్యాపక మంత్రములు.

అంతటను వ్యాపించియుండు భగవంతుని స్వరూపము దెల్పు నవి వ్యాపక మంత్రములు. భగవంతుని అవతారములు, గుణములు, చేష్టలు మొదలైనవానిలో ఒక్కొక్క దానిని, లేదా కొన్నిటిని దెల్పు నవి అవ్యాపక మంత్రములు, అవ్యాపక మంత్రములకన్న వ్యాపక మంత్రములు అగు

1) ఓ న్నమో నారాయణాయ,

2) ఓ న్నమో భగవతే వాసుదేవాయ,

3) ఓ న్నమో విష్ణవే

అను మూడును శ్రేష్ఠమైనవి.

వీనిలోను 'ఓ న్నమో నారాయణాయ' అను తిరుమంత్రమే ముఖ్యము. మిగిలిన రెండును మనను రక్షించు కల్యాణ గుణములు తెలుపుట లేదు. వానిని శిష్టులు పరిగ్రహించుటయు లేదు. అవి భగవంతుని ఆరు విధములగు సమర్థతలను దెలుపుట లేదు. నిండైన యర్థమును వెలువరించుట లేదు. ఇందుకని ఈ రెండు మంత్రాలును తిరుమంత్రముకన్న తక్కువవే.

తిరుమంత్రమును వేదా లొప్పుకొన్నవి. ఋషులు, ఆళ్వార్లును మంచిదని గౌరవించిరి. భగవంతుని మహత్తు వేరు, ఈ తిరుమంత్రపు మహత్తువేరు. భగవంతు డెక్కడనో యుండును. ఈ మంత్రము మన దగ్గరనే యుండి ఉపకారము చేయుచుండును. ద్రౌపది కాపద సమయములో వస్త్రములిచ్చి రక్షించినది ఈ తిరుమంత్రమే కదా! కోపముతో దలంపుము, భయముతో దలంపుము, భక్తితో దలంపుము, ఈ మంత్రములోని పదములను మార్చి తలంపుము! ఎట్లు దలచినను ఈ మంత్రము తన రక్షించు స్వభావమును విడువదు. రక్షించి తీరును.

తిరుమంగయ్యాళ్వార్లు ("కులందరుం" =) గొప్ప కులము నిచ్చును అనుచోటున జెప్పినట్లు, మనకోర్కెల నన్నింటిని ఇది తీర్చును. ఐశ్వర్యము కోరువారి కైశ్వర్యము, మోక్షము గోరువారికి మోక్షము, ఏదికోరినవారి కది సంపాదించిపెట్టును. కర్మిష్ఠులకు గాని, జ్ఞానులకుగాని, భక్తులకుగాని అడ్డమువచ్చు నాటంకము లన్నిటిని బోగొట్టి, తగిన ఫలములను సాధించిపెట్టును. "నీవే నాకు దిక్కని"

శరణాగతి చేసిన ప్రపత్తినిష్ఠలకు, ఆ ప్రపత్తికి దగిన జ్ఞానము (భగవంతునకు దాసుడుగా నుండవలసిన ఆత్మను గూర్చిన జ్ఞానమును) గల్గించి, పొద్దుపుచ్చుటకును, ఆనందము కల్గించుటకును ఈ తిరుమంత్ర ముపయోగించును.

"మత్తెల్లాం పేశిలుం" అనుచోట చెప్పినట్లు ఆత్మను బాగుచేసికొనుటకు గావలసిన ఐదు అర్థములును తిరుమంత్రంలో నున్నవి. వీనినే అర్థపంచక మందురు.

1) ఆత్మస్వరూపము — జీవ లక్షణము; జీవుడు భగవంతునికే దాసుడై యుండుట.

2) పరమాత్మ స్వరూపము - భగవంతుని లక్షణము - భగవంతుడు జీవులను అన్నివిధముల రక్షించువాడై యుండుట.

3) ఫల స్వరూపము - సంపాదింపవలసిన మోక్షము.

4) ఉపాయ స్వరూపము - భగవంతుడే గతియని నమ్మి యుండుట.

5) విరోధి స్వరూపము — మోక్షమున కాటంకము గల్గించునది. (దీనిని వదలుకోవలెను)

ఈ 5 విషయములు తిరుమంత్రములో ఎట్లమిడి యున్నవో చూతము !

"ఓమ్" దీనిలో జీవుడు భగవంతునికే దాసుడై యుండవలెను అను అర్థమున్నది. ఇదే 1. ఆత్మస్వరూపము. "నమః" దీనిలో మోక్షమున కాటంకము గల్గించు ఇతరులకు దాస్యము చేయుటను వదలుకోవలెను అను అర్థమున్నది. ఇతరులకు దాస్యము చేయుట. 5. విరోధి స్వరూపము. ఇది తగదు గావున, దీనిని వదలుకోవలెను. భగవంతునకే దాస్యము చేయవలెనని భావము. ఇట్లు భగవంతునకు దాస్యము చేయుటయే 4 ఉపాయ స్వరూపము.

''నారాయణ'' పదములో భగవంతుడు జీవులను అన్ని విధముల రక్షించువాడై యుండునను అర్థమున్నది. ఇదే 2 పరమాత్మ స్వరూపము.

"ఆయ'' (-కొరకు) అనుదానిలో అతనికొరకే దాస్యము చెప్పబడినది. దీనినే భగవంతుని చేరుట అనియు, మోక్ష మనియు నందురు. ఈ దాస్యమే ౩. ఫల స్వరూపము.

ఈ విధంగా తిరుమంత్రము ఐదర్థములను దెలుపుచున్నది. మన పూర్వాచార్యులు ఈ తిరుమంత్ర అర్థమును తెలిసికొనక ముందు జన్మించినను తమది సార్థకము గాని జన్మయే యనుకొన్నారు. తిరుమంత్రార్థములోని ఈ 5 విషయములను దెలిసికొన్న వానిదే సార్థకమైన జన్మ అన్నమాట. ఈ విషయము దెలిసికొన్న తర్వాత "పిరంద పిన్ మరంది లేన్'' (. తెలిసికొన్న తర్వాత మరచిపోలేదు.) అని చెప్పినట్లు దీనితో తప్ప నితర విషయములతో వారు కాలక్షేపము చేయలేదు. మంత్రమందుకన్న, మంత్రములోని అర్థమగు భగవంతుని యందే యెక్కువ మక్కువ గల్గియున్నారు. ఎందుకనగా,

భగవంతుడే మనకు బుద్ధిబుట్టించి అన్ని విధాల తన సేవ చేయించుకోవలెను. కాబట్టి భగవంతుని బొందుటకు ఉపాయము భగవంతుడే, ఉపేయము (- పొందదగిన వస్తువు) భగవంతుడే కదా! అందుకనే మంత్రమందుకన్న భగవంతునందే రక్షించు నన్న నమ్మకం పెట్టుకొని వారున్నారు.

తిరుమంత్రములో ఎనిమి దక్షరములున్నవి. కావుననే దీనిని అష్టాక్షరి మంత్రమని కూడ నందురు. ఈ 8 అక్షరములు 3 పదములుగా నున్నవి. "ఓం - నమః నారాయణాయ" ఔనుగదా! ఈ మూడు పదములును మూడు అర్థములు తెలుపుచున్నవి.

'ఓం' అనుదానివల్ల దాస్యము
'నమః' అనుదానివల్ల తనకు తాను రక్షకుడు కాకపోవుట.

నారాయణాయ అనుదానివల్ల నారాయణునకే దాస్యము (– కైంకర్యము) చేయవలయునని దెలియుచున్నది. అ + ఉ + మ్ అను అక్షరములు కలసి "ఓమ్" అయినది. దీనిలో అకారము, ఉకారము, మకారము అని 3 అక్షరములు కలిసినవి. మూడుకుండలలో పెరుగును దరచి, తీసిన వెన్నను ఒకే ముద్దచేసినట్లు మూడు వేదాలలో నుండి ఈ మూడక్షరములను దీసి, ఈ ఓం అను ఒకేపదముగా చేసిరి. అందుకే ఓంకారము వేద సారమందురు.

అకారము అన్ని శబ్దములకు కారణమై భగవంతుని తెల్పునట్లే, భగవంతుడు అన్ని లోకములకు గారణమై అందరను రక్షించువాడను అర్థమును దెల్పుచున్నది. "అ" అనగా అన్ని లోకములను బుట్టించి రక్షించు నారాయణుడు. రక్షించుటనగా కష్టములను బోగొట్టి ఇష్టముల నీడేర్చుట. ఈ కష్టములు, వాంఛలు రెండును జీవులందరికిని వారి వారి స్థితిగతులకు దగినట్లుండును.

సంసారులకు వేపుకొనితిను శత్రుపీడ మొదలైనవి కష్టము; అన్నము నీళ్ళు మొదలైనవి యిష్టము. మోక్షము గోరువారికి సంసారము కష్టము, మోక్ష మిష్టము. మోక్షము పొందినవారికి వైకుంఠంలో నిత్యమును భగవంతుని సేవించు నిత్యసూరులకును భగవత్సేవ చేయకుండుట కష్టము; ఎడతెగక సేవించుట యిష్టము. వారి వారి ఆయా కష్టముల బోగొట్టి యిష్టముల నీడేర్చుచు భగవంతుడు రక్షించుచున్నాడు. అట్లు రక్షించు భగవంతుడే అకారముచేత చెప్పబడుచున్నాడు. ప్రపన్న పరిత్రాణమను గ్రంథములో భగవంతుడు వినా రక్షకుడులేడని యున్నది. సరే, రక్షించుటకు ఆ జగన్మాత లక్ష్మి కూడ ఉండవలెను. ఉన్నది. లక్ష్మి నారాయణుని నీడ విడచియుండునా? ఎప్పుడూ నతని వక్షస్థలమందే యుండును. కావున అకారములో నే లక్ష్మి కూడ నున్నది. తల్లి అటు మగని పడకను ఇటు బిడ్డతొట్లెను విడువకుండ మధ్యను బరుండునట్లే లక్ష్మితల్లి అటు నారాయణుని

( = అకారమును) ఇటు జీవుని ( = మకారమును విడువక మధ్యమం దుండును. ఉకారము లక్ష్మికాబోలునని పొరపడకుడు; లక్ష్మి అకారములోనే యిమిడియున్నదని చెప్పుకొన్నాము. యశోద అటు నందుని యిటు కృష్ణుని విడువకుండ నుండునట్లే, లక్ష్మి అటు నారాయణుని వక్షస్థలమున నుండుచు, నిటు బిడ్డడగు జీవుని ఆలన పాలన చేయుచుండును. సూర్యుని విడిచి, యెండ యుండదు, పువ్వును విడచి పరిమళ ముండదు, అట్లే నారాయణుని విడచి లక్ష్మి యుండదు. అకారమునందు నారాయణుడున్నాడనగా, నారాయణుని వెంట లక్ష్మి వుండనే యున్నదని తెలిసికోవలెను. జీతగాడు యజమాని పేరున కాగితము వ్రాసి, జీతమునకు గుదిరినను, ఆయన భార్య చెప్పిన మాట కూడ వినవద్దా! అట్లే అకారమువల్ల నారాయణునకు మాత్రమే మనము దాస్యము చేయవలెనని అర్థము వచ్చుచున్నను, లక్ష్మికి గూడ దాస్యము చేయవలెనని చెప్పినట్లే యెంచుకోవలెను. ఈ యిరువురు చేరియున్నప్పుడు సేవచేయుటయే మనము కోరుకోవలసినది కూడ.

అకారమునకు కొరకు అను విభక్తి వచ్చియును కనబడకుండ నున్నది. అ = నారాయణుని కొరకు (దాస్యము చేయవలయునని భావము) దాస్యము చేయుట కష్టముకదా, అందురేమో. తనకిష్టమై ఆనందమును గలుగజేయు విషయములో దాస్యము చేయుటయు సుఖమే యనిపించును. భగవంతునియందున్న భక్తుల రక్షించు కల్యాణ గుణములను బట్టియే, ఆయనకు మనము సేవ చేయుదుము. ఇది మనకు సుఖమే యనిపించును. అంతేకాక "భగవంతునికి దాస్యము చేయుటయే ఆత్మయొక్క పని, ఆత్మ సొత్తు, భగవంతుడు స్వామి. భగవంతుడు జీవాత్మ చేత దాస్యము చేయించుకొనును". ఈ విధముగా శాస్త్రమునందు చెప్పబడియుండగా 'నేను స్వతంత్రుడను' అని తలచి భగవద్దాస్యము చేయదలపకున్నచో ఆ జీవాత్మ చెడుగతులకు బోవలసినదే.

ఉకారమున్న స్థలమునుబట్టి చూచినచో దీనికి ("ఉ"= మాత్రమే =) "ఏ" అని అర్థము చెప్పదగును. దీనివల్ల ఇతరులకు జీవాత్మ దాస్యము చేయనక్కర లేదనియు ఆ నారాయణునకు మాత్రమే నమస్కారాది దాస్యము చేయవలసియుండుననియు దెలియుచున్నది.

కొందరీ ఉకారమునకు లక్ష్మియని అర్థము చెప్పుచున్నారు. అట్లు లక్ష్మికిగూడ దాస్యము చేయవలెనని చెప్పుటకన్న "భగవదితరులకు దాస్యము చేయనక్కర లేదని చెప్పుటలో విశేషమున్నది. దేవతలకు బెట్టదగిన యన్నమును కుక్కలకు వేయవచ్చునా! అలాగే ఈశ్వరునకు దాస్యము చేయవలసిన ఈ యాత్మవస్తువు తదితరులకు దాస్యము చేయగూడదు. 'మరచిపోయియైనను ఇతరులకు నమస్కరింపనివారే భగవద్దాసులు' అను పెద్దల మాటలనుబట్టి యాలోచించినచో, భగవంతునకు దాసులగుటకన్న ఇతరులకేమి, తనకేమి, ఎవరికిని దాసులు కాకపోవుటలోనే పాటవమున్నదని తెలియుచున్నది.

ఇంతకు,"అ" = శ్రియఃపతికొరకు, ''ఉ''-మాత్రమే నమస్కారాది దాస్యము చేయవలసి యున్నదని అర్థము చెప్పుకొనుటలోనే మంచి నిష్ఠ గోచరించుచున్నది, అని భావము.

ఈ మన శరీరములో ఇరువదియైదు తత్వము లున్నవి. కకారము మొదలుకొని మకారమను అక్షరమువరకు 25 అక్షరాలున్నవి. ఈ 25వ అక్షరమగు మకారమునకు జ్ఞానమను నర్థముగూడ నుండుట వల్ల పెద్దలు అత్మ అను నర్థము చేసిరి. (మ-ఆత్మ-జీవుడు) మిగిలిన 24 తత్వము లేవో వినుడు :

చెవులు, కన్నులు, చర్మము (—స్పర్శము) నాలుక, ముక్కు అనునవి 5; కాళ్ళు, చేతులు, నోరు, మలద్వారము, మూత్రద్వారము అనునవి 5; మట్టి, నీరు, నిప్పు, గాలి, ఆకాశము అనునవి 5; వాసన, రుచి; రూపము, తాకుడు, చప్పుడు అనునవి 5, మనసు బుద్ధి చిత్తమును 24 తత్వము లందురు. ఇవన్ని యుగూడి మన శరీర మయినది. 24 వ ది

జీవాత్మ. 24 తత్వములకు చేతనత్వము లేదు. జీవాత్మయే చేతనమైనది. "మ" అనగా ఒక ఆత్మయే కాదు, ఆత్మల గుంపు. ప్రాణము గలిగి తెలిసికొనునది ఆత్మ కావున, శరీరముకన్నా గొప్పదని తెలిసికొను చున్నాము. తత్వశేఖరమను గ్రంథంలో, దేహమునకన్న ఆత్మ యెట్లు ప్రత్యేకము గొప్పతనము గలదో వివరముగా దెలుపబడినది. పరిమళమునుబట్టి పువ్వును, కాంతినిబట్టి రత్నమును మెచ్చుకొందుము. అలాగే నారాయణుని సేవచేయుటనుబట్టి, ఆత్మకు విలువ నిత్తుము, మెచ్చుకొందుము. భగవంతునకు దాస్యము చేయని జీవాత్మను తలచనక్కరయేలేదు. అది చెడు గతులకు బోవలసినదే.




నారాయణుని కొరకే జీవాత్మ (దాస్యము చేయవలెను) ఓంకారముచేత దేవునికిని జీవునికిని ఎటువంటి సంబంధమున్నదో చెప్పబడినది. పెద్దలును వైకుంఠములో నారాయణుని సేవించుచు, సుఖము ననుభవింప వలసిన యీదాసుడు, ఇతరులకు దాసుడు కావచ్చునా?" అని అన్నారు. జీవాత్మకు శ్రీమన్నారాయణు నొక్కనినే సేవింపవలెనన్న జ్ఞాన ముండవలెను.

అకారము ద్వారా రక్షించు దేవుని గూర్చి, మకారము ద్వారా రక్షింపబడు జీవునిగూర్చి చెప్పుకొనుచున్నాము. ఉకారము ద్వారా ఆ దేవునికొరకే ఈ జీవులు దాసులై యుండుట ఫలితమనియు చెప్పుకొన్నాము. ఇప్పటికి ఓంకారార్థము పూర్తియైనది.

ఉకారములోని రహస్యార్థము నమః పదములోను, అకారములోని రహస్యార్థము నారాయణ పదములోను, మకారములోని రహ

స్యార్థము అయ అను ప్రత్యయములోను విపులముగా దెలియబడు చున్నవి. (కొందరు మకారములోని రహస్యార్థము 'నార' అనుపదము వివరముగా దెలుపుచున్న దందురు. నారము = జీవులు, నార + అయనుడు = నారాయణుడు = జీవులకు స్థానమైన వాడు.)

నమః ముందుచెప్పి, నారాయణాయ తర్వాత చెప్పబడిన కారణమేమిటి! నమః - నాకు నేను దాసుడను గాను. అని చెప్పుకొన్న తర్వాతనే నారాయణాయ - నారాయణుని కొరకే, అన్నట్లయితే, ఈ జీవుడు ఇతరుల కేమిటి తనకుగూడ దాసుడుకాకుండ 'నీకు దాసుడు' ననుచున్నాడే అని తలచి, నారాయణుడు కనికరించును. అందులకే మంత్రమందు, నారాయణ పదముకన్న ముందే, నమః పదముంచ బడినది.

"నమః" లో మః అని, న అనియు రెండక్షరము లున్నవి. మః - నాకు న (దాసుడను) కాను. నమః - నాకు నేను దాసుడను గాను. అన్ని విధాల గొప్పవాడు భగవంతుడు గావున, అతనికే యని చెప్పుకొనుట కవకాశ మున్నది. నాకే నేను దాసుడ ననగా తన శరీరపోషణము, తన యింటికృత్యము మాత్రమే చూచుకొనుట యగును. తనకు తానే దాసుడై యుండువానిని భగవంతుడు దయ జూడడు' తనవైపు మళ్ళించుకొనడు. మోక్ష యోగ్యత వీనికి లేదను కొని వదలును. అందుకని ముందు నమః ఉండుటే బాగు.

భగవంతుని బొందుటకు మూడు ఆటంకము లున్నవి. 1. స్వరూప విరోధి, 2. ఉపాయ విరోధి, 3. ప్రాప్యవిరోధి. ఇవి: స్వరూపవిరోధి యనగా భగవంతుని దాసుడై యుండుటే తన స్వరూపమై యుండగా, భగవద్దాసుడ నని నమ్మియుండక, నేను నాది యని అహంకారపడుట. ఉపాయవిరోధి యనగా భగవంతుడే ఉపాయమై యుండగా కర్మ-జ్ఞాన-భక్తులే; ఉపాయము లని నమ్మియుండుట.

లేనిది గావున, ఇతరుల కుపయోగ పడునని, ఆత్మ చైతన్యము గలది గావున, తనకు నితరులకు నుపయోగ పడుననియు దెలియుచున్నది.

ఇప్పుడు నమః (- నాకు నేను స్వతంత్రుడను గాను) అనుటవల్ల భగవంతుడు నన్ను, ఇతరులకు మాత్రముపయోగించు అచిత్తును వలెనే, తన యానందము కొరకే వినియోగించుకొనుగాక, అని చెప్పినట్లయినది.

భగవంతుడు, తన యానందముకొఱకు జీవునితో గలిసిమెలసి యుండునప్పుడు ఆయన యిష్టము, చంక నెత్తుకొననిమ్ము, నెత్తికెత్తు కొననిమ్ము; అప్పుడు "అయ్యో! నేను దాసుడనుగా నుండవలసిన వాడను గదా, నా దాస్యము చెడిపోవునేమో" యని అతని అంకె సంకెలలకు రాకుండ పోగూడదు, ఈ ఆత్మ అతనిదాసుడు. ఏమైనను చేసికొననిమ్ము ఆయన యిష్టము అనుకోవలెను, ముద్దువచ్చినప్పుడు చంకనెక్కిననే మనము చేయదలచిన పనిని చేసినవార మగుదుము. బిగదీసికొని కూర్చుండిన ఆయన యానందమును జెడగొట్టినవార మగుదుము; మనమును చెడుదుము, ఓంకారమువల్ల నయిననేమి, నారాయణపదమువల్ల నయిననేమి, నారాయణునకే దాస్యము చేయ వలయునని తెలియుచున్నది. కావున దాస్యము చేయుటయే ముఖ్య మనుకొనవలెను. పెరుమాళ్ళ యానందమున కభ్యంతరము గల్గింప రాదు.

ఈ విధముగా శ్రియఃపతిని సంతోషపెట్టుటకు ఆయన కిష్టమని చేయు యజ్ఞ యాగాలు, ప్రాయశ్చిత్తాలు, పాపములు పోగొట్టును. అన్ని లాభములు గలిగించును. భగవత్ప్రీత్యర్థముగా జేయని యజ్ఞ యాగాది సత్క్రియ లన్నియు వ్యర్థము.

నారాయణుడు = నశింపని వస్తువులకు స్థానమైనవాడు. నారము లనగా నశింపని వస్తువులు.

నారములు : జ్ఞానము, ఆనందము, అమలత్వము మొదలైనవి, వాత్సల్యము, సౌశీల్యము మొ॥ విగ్రహములు కాంతి సౌకుమార్యము

మొ॥ వారి మంచినగలు మంచి యాయుధములు లక్ష్మి మొదలగు అమ్మవార్లును, వైకుంఠములో నెప్పుడును పరమాత్మను సేవించు నిత్యసూరులును, గొడుగు చామరము మొ॥ వారి ద్వారపాలకులు సేనాపతులు మోక్షమొందిన వారు వైకుంఠము ప్రకృతి సంసారములో నుండు జీవులు కాలము మహత్తు మొదలైన వికారములు, బ్రహ్మాండములలో నుండు దేవతలు వస్తువులు యన్నింటికిని (అయనము =) స్థానమైన వాడు.

నార + అయనుడు = నారాయణుడు = 1. (పైన చెప్పబడిన) నారము లన్నింటికి నాధారమైనవాడు. 2. ఆ నారము లన్నింటికి అంతర్యామి యైనవాడు, అనియు నర్థము చెప్పవచ్చు. ఈ రెండు విధముల అర్థము చెప్పుకొనుటవల్ల, నారాయణునకు రెండుగుణములున్నవని తెలియుచున్నది. వీని యన్నింటికి నాధారమైన వాడనుటవల్ల గొప్పవాడనియు, వీని నాశ్రయించుకొని అంతర్యామిగా నున్నాడనుటవల్ల ప్రతివానికి చాల సులువుగా నందుబాటులో నున్నాడనియు దెలియుచున్నది. మరియు అన్ని వస్తువులలో నిమిడి యున్నాడని, జీవాత్మల జేరదీసికొను ఉపాయమైన వాడని, ఈ జీవాత్మలు చేరవలసిన గమ్యస్థానము వాడే యనియును జెప్పుకోవచ్చును.

"భగవంతుడు నా కుపకారము చేయును, నా తండ్రి, నా చుట్టము, నా రాజు" అని తిరుమంగై యాళ్వార్లు చెప్పినట్లు సర్వేశ్వరుడే మన కన్ని విధాల బంధువు. మన మాయన పనిలో నుండక ప్రాపంచికమగు నితరమైన పనులలో నుండినను ఆయన మనను రక్షించు పనిలోనే యుండును.

ఉదాహరణము : మన బంధువు ఒకడు అడిగితేనక అభిమానపడి భోజనము మానినా డనుకొందము. అది మనము తెలిసికొన్న తరువాత చాటున నుండి సత్రములోనైన నింతయన్నము పెట్టు నేర్పాటు చేయుదుము. అట్లే భగవంతుడు, నీ దాసుడనని తలవంచక

విరప్పిగి తిరుగుచున్న జీవుని, అంతరాత్మగా వానిలోనే యుండి యున్నాడు గావున, మంచిమార్గమునకు దిప్పును. అట్టి దయామయు డగు నారాయణుని,

"అయ" (- కొరకు) అతనికొరకే సేవ చేయవలయును అను ప్రార్థన తెలుపబడుచున్నది. ఇదివరకు (నమః -) నాకు నేను రక్షించు కొనువాడ గాను, నాకు వాడే రక్షకుడు అనుటవల్ల బరువుభార మంతయు దేవునిమీదనేపడవైచెను. నీకు దాస్యము చేయుదును చేయించు కొమ్ము అని దేవుని ప్రార్థించుట అవసరమా? అందురేమో వినుడు "నీకు పాదుకలుగానై చిగురుటాకువంటి నీ శ్రీముఖమును సేవించు చుందును" అని పెద్దలు చెప్పుచున్నారు. భగవంతుని వాడై భగవంతుని సేవచేయుటకైనను ఆయన పాదుకలుగా నుపయోగపడవల యును గదా! అందుకనే ప్రార్థించుట. అంతేకాని జీవుడు తన సొంత లాభమును కోరికాదు. మధ్య తెచ్చిపెట్టుకున్న ప్రార్థనయు గాదు. అట్లు సేవచేయుట ఆత్మయొక్క లక్షణమే. జీవులందులకే పుట్టినారు. ప్రార్థించుట చాలా యవసరము. కావుననే 'అయ' (– కొరకు) అనుచోట మన మెడతెగక సదా దాస్యము చేయుచునే యుండవల యును అని పెద్దలు అర్థము చెప్పుదురు.

"కన్నులార సేవించి కాలము గడుపు నాశగల వారికి నిద్ర వచ్చునా?" "నిత్యసూరులు సదా సేవించుచున్నారు" "సేవించుట కనుకూలమగు రోజులను వృథాగా గడిపితిని" అను పెద్దల శ్రీసూక్తుల వల్ల భక్తులు జరిగిపోయిన కాలమందు జరుగుచున్న కాలమందు జరుగబోవు కాలమందును భగవత్సేవకొరకే తహతహ పడుచుందురని తెలియుచున్నది. సేవింపక ముందెప్పుడు సేవింతుమా అను తహతహ వల్ల నిద్రపట్టదు. సేవించునపుడు సేవించి యానందించుటయే సరిపోవును. సేవించిన తర్వాత వృథాగా గడిపిన రోజులకై దుఃఖించు చుండ సేవింపక యింకను నిద్రపోవుదురా? "అజ్ఞానినై యున్నప్పుడు

నేను పుట్టినను పుట్టనట్లే, జ్ఞానము నెరిగిన తర్వాత సర్వేశ్వరు నెన్నడును మరచియుండ" లేదను శ్రీసూక్తి వల్ల మనము మనతోడి జీవులును, ఈ జ్ఞానము లేనప్పుడు పుట్టనట్లే. జ్ఞానము గల్గినతర్వాత మరచిపోక భగవన్మంత్రము నందు భగవంతునియందు నిష్ఠగలవాండ్రయై సేవ చేయుచుండ వలయునని గ్రహింపవలెను.

ఈ విధముగా సర్వదేశ – సర్వకాల సర్వావస్థలయందును భగవంతుని కొరకే దాస్యము చేయుచుండవలెనని ఆయ (– కొరకు) తెలుపుచున్నది.

ఈ తిరుమంత్రము 8 దారములతో 3 పురులువేసిన మంగళ సూత్రము వంటిది. 8 దారములు 8 అక్షరములు, 3 పురులు 3 పదములు. లోకములో సమర్థుడైన రాజు మంగళసూత్రము కట్టి భార్యలను రక్షించుకొనును.

## ద్వయ మంత్రార్థము :

విష్ణుభక్తి కలవారందరును వైష్ణవులే - వైష్ణవులకీ లక్షణము లుండవలెను. ఈ లోకములో సుఖముగా గనిపించు ధనము భోజనము వస్తువులు వాహనాలు భార్యాపుత్రులు మొదలైన వానితో నున్న సంబంధమును వాసనతో సహా విడిచిపెట్టవలెను. (అనగా అన్నింటిని విడచి అందరిని విడచి అడవికి పోవలెనని అర్థముగాదు. సంసారములో నున్నను రేగడిబురదలోని కుమ్మరిపురుగువలె అంటీయంటక యుండవలెను. భగవంతుడే రక్షించువాడని అతనినే నమ్ముకొని యుండవలెను.

ఇట్లు నమ్మియుండియు మోక్షము కల్గినప్పుడు చూచుకొందములే యనుకొనక 'ఆ పెరుమాళ్ళ వైకుంఠము నెప్పుడు సేవించుకొందుమా' యని ఆతురత పడవలెను. బ్రతికి యున్నంతకాలము శ్రీరంగము తిరుపతి మొదలగు దివ్యదేశములను సేవించుచు, భగవత్కల్యాణ గుణములు దెల్పు తిరునామ సంకీర్తనలు చేయుచు, భగవదారాధనలతో గాలక్షేపము చేయుచుండవలెను. ఈ ప్రకారము చేయు భాగవ

తోత్తములు కనబడినపుడు "అహా! భాగవతోత్తములను సేవించుకో గలిగినా"నని యానందపడవలెను. మరచిపోయియైన నితర మంత్రముల జోలికిపోక తిరుమంత్ర - ద్వయమంత్రముల శ్రద్ధాభక్తులతో జపము చేసికొనుచుండవలెను. మంత్రముపదేశించిన యాచార్యుల యందెంతో భక్తిగలిగి యుండవలెను. ఇనుమును బంగారము చేసినట్లు మూర్ఖులైన తమను మూర్ఖత్వము బోగొట్టి భగవంతుని జేరు మార్గము జూపించిన ఆచార్యుల యుపకారమును మరచిపోరాదు. జ్ఞానవైరాగ్యరాంతములు గలవారితో సావాసము చేయుచుండవలెను. ఇవే వైష్ణవాధికారుల కుండవలసిన లక్షణములు.

వైష్ణవుడనగా విష్ణుభక్తుడని యర్థమే కాని, వైష్ణవ వంశస్థుడే యని యర్థముగాదు. బ్రాహ్మణుడు కాని శూద్రుడుకాని పంచముడు కాని ఎవరైనను సరే, విష్ణుభక్తి కలవారందరును వైష్ణవులే. అన్ని కులాలవారికి అన్ని జాతులవారికి స్వదేశస్థులకు విదేశస్థులకు అందరికిని ఈ వైష్ణవము పుచ్చుకొనుట కధికార మున్నది. పై లక్షణములున్న వాడే నిజమైన వైష్ణవుడు. అవి లేని వైష్ణవ కులస్థుడును నిజమగు వైష్ణవుడు కాడు.

అట్టి లక్షణములున్న వైష్ణవాధికారి తిరుమంత్రము - ద్వయ మంత్రము - చరమశ్లోకమును అర్థముతో సహా తెలిసికొని జంపించుచు, తదనుకూలముగా ననుష్ఠింపవలెను. ఈ మూడు మంత్రములుకాక తక్కిన శాస్త్రమంతయు, జీవుల వర్ణాశ్రమ ధర్మముల ననుసరించి, దేహము ద్వారానే మోక్షమును సంపాదింపవలెనని తెలుపుచున్నది.

తిరుమంత్ర మేమి తెలుపుచున్నది ?

"మోక్షమునిచ్చు బరువుభారము భగవంతుని మీదనే పెట్టి, ఆత్మ తనను రక్షించుకొను ప్రయత్నము విడుచుకోవలెను - ఈలాగున విడుచుకోవలసినది ఆత్మయే కావున, ఆత్మద్వారానే మోక్షము సంపాదింపవలెనని తిరుమంత్రము తెలుపుచున్నది" చరమశ్లోక మేమి

